# బొమ్మలు చేయడం






అబ్బూరి ఛాయాదేవి



విశాలా గ్రంథశాల

హైదరాబాదు

**Bommalu Cheyadam**
**By Abburi Chaya Devi**

Cover Design and layout :
**Sri Seela Veerraju**

First Published : 1996

Price : **Rs.30/-**



Published by **Visala Granthasala,**
HIG/B4/F4,
Bagh Lingampally, Hyderabad - 500 044.

Copies available with :

1. Visalandhra Book House,
   Bank Street, Hyderabad-500 001
2. Navodaya Book House,
   Kachiguda, Hyderabad-500 027
3. Navodaya Publishers,
   Karl Marx Road, Vijayawada-520 002
4. Pallavi Publications,
   Eluru Road, Vijayawada-520 002

Composed by : **Vivek Graphics**
Nallakunta, Hyderabad-500 044

Printed by : **Charita Graphics,**
Chikkadpally, Hyderabad - 500 020.

Cover page printed by : **Kala Jyoti Process Pvt. Ltd.**
RTC 'X' Roads, Hyderabad - 500 029.

# అంకితం

ప్రముఖ కథారచయిత, చిత్రకారుడు,

స్నేహశీలి, సహనశీలి

**శ్రీ శీలా వీర్రాజుగారికి**

సగౌరవంగా ___

**—అబ్బూరి ఛాయాదేవి**



'చేట భారతం'

# కృతజ్ఞతలు

ఇందులోని వ్యాసాలనూ, కొన్ని బొమ్మల ఛాయా చిత్రాలనూ 'ఈనాడు - వసుంధర' లో అక్టోబరు 1992 - ఫిబ్రవరి 1993 మధ్యకాలంలో వారం వారం ప్రచురించినందుకూ, ఆ ఛాయా చిత్రాలను ఇందులో ప్రచురించడానికి ఇచ్చినందుకూ 'ఈనాడు' పత్రికాధిపతులకు నా కృతజ్ఞతలు.

మరికొన్ని రంగుల ఛాయా చిత్రాలను తీసిన శ్రీ ఫణికుమార్‌కీ, తెలుపు-నలుపు చిత్రాలను తీసిన శ్రీ భరత్ భూషణ్‌కీ, కొన్ని రంగుల చిత్రాలను 1992 దసరా సంచికలో ప్రచురించిన 'వనిత' మాసపత్రిక వారికీ నా కృతజ్ఞతలు.

—అబ్బూరి ఛాయాదేవి



# ఇందులో





# 1. ఖాళీ సమయాల్లో కళాసృష్టి

నిత్యం మనం ఎన్నో వస్తువులను ఉపయోగించుకుని, అవసరం తీరగానే పారేస్తూంటాం. సెంటు సీసాలు, పౌడరు డబ్బాలు, షాంపూ సీసాలు, పాత ఇన్విటేషన్ కార్డులు, గ్రీటింగ్ కార్డులు, దారం అయిపోయిన అట్టగొట్టాలు, అరిగిపోయిన షేవింగ్ స్టిక్స్ - ఇలా ఎన్నిటినో అనవసరపు వస్తువులుగా పరిగణించి పారేస్తూంటాం. కానీ, వాటిలో కొన్నిటితో నూతన కళాసృష్టి చెయ్యవచ్చు. ఇష్టంగా చేస్తే అందులోని ఆనందం అనుభవించిన వారికే తెలుస్తుంది. ప్రతి వస్తువునీ కళాత్మక దృష్టితో చూసే సున్నితత్వం, సునిశితత్వం అలవడతాయి.

మనం స్వయంగా చెయ్యడం మొదలు పెడితే, చేస్తున్నకొద్దీ కొత్త ఆలోచనలొస్తాయి. కొత్త పద్ధతులు స్ఫురిస్తాయి, సామర్థ్యం పెరుగుతుంది. సమయం విలువ తెలిసివస్తుంది. వృథా అనుకున్న వస్తువుల్ని సద్వినియోగం చేసుకోవడంవల్ల సమయాన్ని వృథాచెయ్యకుండా ఉండటం కూడా అలవాటవుతుంది.

ఆ రోజుల్లో చిన్నప్పుడు తాటాకులతో బొమ్మలుచేసి, వాటికి ముస్తాబుచేసి ఆడుకునేవాళ్లం. అటువంటి బొమ్మని చేసి ఈ కాలం పిల్లలకి చూపించామా ఎప్పుడైనా? ఆనాడు ఆడపిల్లలందరూ చవకరకం చందనం బొమ్మలకి బట్టలు కట్టి బొమ్మల పెళ్లివంటి ఆటలాడుకునేవారు. పెద్దసైజు చందనం బొమ్మలకి ముస్తాబు చేసి ఈనాడు బొమ్మల కొలువులో ఎందుకు పెట్టుకోకూడదూ?

అభిరుచీ, సామర్థ్యం ఉన్న తల్లిదండ్రులూ, పిల్లలూ ఎన్నోరకాల బొమ్మల్ని స్వయంగా తయారుచేసి అద్దాల అలమారుల్లో దాచుకోవచ్చు. గోడల్ని అలంకరించుకోవచ్చు. బంధుమిత్రులకు బహూకరించవచ్చు. పిల్లలు ఆడుకునేందుకు చేసిపెట్టొచ్చు.

బొమ్మలే కాకుండా ఇంకా ఎన్నో ప్రయోజనకరమైన వస్తువుల్ని తయారు చేసుకోవచ్చు. ఉదాహరణకి, 'వేస్ట్ మెటీరియల్‌తో అందమైన "వేస్ట్ పేపర్ బాస్కెట్స్" తయారు చేసుకోవచ్చు.

అట్టముక్కలూ, బట్టముక్కలూ, ఖాళీసీసాలూ, కొబ్బరి చిప్పలూ, వెలక్కాయ డొల్లలూ, చిరిగిపోయిన గోనెసంచులూ ఇటువంటి వాటితో రకరకాల చిత్రవిచిత్రాలు సృష్టించవచ్చు. వీటితో ఏమేం చెయ్యవచ్చో, ఎలా చెయ్యవచ్చో తెలుసుకుందాం.



# 2. పాత అట్టపెట్టెలకు కొత్తరూపాలు

**ఖా**ళీ అట్టపెట్టెలు - 'టీ' పేకెట్లు మొదలుకొని పెద్ద పేకేజి పెట్టెల వరకూ అన్నిటినీ అందంగా మార్చి, రకరకాలుగా ఉపయోగించుకోవచ్చు. చిన్న అట్టపెట్టెల్ని ముస్తాబుచేసి, రాత బల్లమీద పెట్టుకుని, వాటిలో పెన్సిళ్లూ, కలాలూ, బ్రష్‌లూ, గమ్‌ట్యూబ్ మొదలైన వాటిని వేసుకోవచ్చు. లేదా, దారపు కండెలూ, చిన్న కత్తెర, మొదలైనవి పెట్టుకోవచ్చు. పెద్దపెట్టెల్ని అలంకరించి, వాటిలో పాత పత్రికలూ, ఎక్సర్‌సైజు పుస్తకాలూ మొదలైనవి పెట్టుకోవడానికి ఉపయోగించవచ్చు. కొన్ని పెట్టెల్ని చిత్తు కాగితాల్ని వేసుకునేందుకు వీలుగా డ్రాయింగ్ రూమ్‌లో ఒక మూలా, రాతబల్లకిందా, బెడ్‌రూమ్‌లో ఒక మూలా పెట్టుకోవచ్చు.

మనవాళ్లకి చిత్తు కాగితాలూ, అగ్గిపుల్లలూ, తల దువ్వుకున్నాక వెంట్రుక చుట్టలూ నేలమీద పడెయ్యడం, కిటికీలోంచి బయట పడెయ్యడం- ఒక చెడ్డ అలవాటుంది. పనిమనిషి ఎప్పుడో వచ్చి ఊడుస్తుంది కదా అని ఎక్కడపడితే అక్కడ చెత్త పడేస్తే ఏం బావుంటుంది? శుభ్రతలో క్రమశిక్షణ మనం స్వయంగా పాటిస్తూ, పిల్లలకు కూడా అలవరచాలి. అందుకని వీలైనన్ని 'వేస్ట్‌పేపర్ బాస్కెట్స్' ఉంచాలి ఇంట్లో. చాక్‌లెట్ తిని, కాగితాన్ని నేలమీద పడెయ్యకుండా, గదిలో మూలనున్న డబ్బాలో వెయ్యడం అలవాటు చెయ్యాలి పిల్లలకి. పోస్ట్‌మేన్ కవర్ ఇచ్చి వెళ్తే కవరు పైనచింపి, ఆ ముక్కని కింద పారెయ్యని పెద్దవాళ్లుండరు మనదేశంలో! ఆదొక చెడ్డ అలవాటు. నోట్స్ రాసుకుంటూ అవసరంలేని కాగితాన్ని ఉండచుట్టి కిందికి విసిరేస్తారు. ఇటువంటి పద్ధతులు మార్చుకుని, వేస్ట్‌పేపర్ బాస్కెట్లు ఉపయోగించడం అలవరచుకోవాలి

అట్ట పెట్టెల్ని అందంగా తయారు చెయ్యడానికి ఎక్కువ ఖర్చుపెట్టక్కర్లేదు. ఎక్కువ కష్టపడక్కర్లేదు.

(1) ముందు, చిన్న పెట్టెల్ని తీసుకుందాం. ఉదాహరణకి, టీపొడితో వచ్చే చిన్న అట్టపెట్టె (డబ్బా). ఇంట్లో ఉన్న పాతరంగు బట్టముక్కా, పాత గ్రీటింగ్ కార్డులూ, మొదలైనవి, ఫెవికోల్‌గాని, ముద్దలా ఉడకబెట్టిన మైదాపిండిగాని - ఇంతే కావలసిన సామగ్రి. ఏదైనా పాత రంగుబట్ట తీసుకుని, అట్టపెట్టె ఎత్తుకన్నా ఒక అంగుళంపైనా, ఒక అంగుళం కిందా ఎక్కువగా ఉండేటట్లుగానూ, పెట్టెకి నాలుగువైపులా చుట్టి అంటించేందుకు సరిపోయేటంత పొడవుగానూ బట్ట ముక్కని కత్తిరించుకోవాలి.

పెట్టెచుట్టూ బట్టని చుట్టేటప్పుడు పెట్టె మీద కొద్దిగా, ఫెవికోల్‌గాని ఉడకపెట్టిన మైదా పిండిగాని రాయాలి. ఒక చాకుతో రాయచ్చు చేతులు పాడవకుండా. ఫెవికోల్ అయితే పెయింట్ చెయ్యడానికి వాడే చిన్న బ్రష్‌ని వాడొచ్చు. ఎక్కువ వృథా కాకుండానూ, శుభ్రంగానూ ఉంటుంది. నాలుగు పక్కలా చుట్టిన తరవాత, బట్ట అంచుల్ని ఒక దానిమీద ఒకటి వచ్చేటట్లు అతికించాలి. ఈ అతుకు ఒక మూలకి వచ్చేటట్లు - మధ్యలో కనిపించేటట్లు కాకుండా వంకర లేకుండా చూసుకోవాలి.

పెట్టెపైన మిగిలిన బట్ట అంచుల్ని పెట్టెలోపలి వైపుకి మడిచి అతికించాలి. కిందవైపు మిగిలిన బట్ట అంచుల్ని పెట్టె అడుగుభాగంవైపు నాలుగు పక్కలా అతికించాలి. పెట్టె అడుగుభాగం అంతమేరా మరొక చిన్న బట్టముక్కని అతికిస్తే పెట్టె దృఢంగా ఉంటుంది.

మంచి బొమ్మలున్న గ్రీటింగ్ కార్డులను తగు రీతిలో కత్తిరించుకుని అట్టపెట్టెకి నాలుగువైపులా ఫెవికోల్‌తో అతికించి ఆకర్షణీయంగా తయారు చెయ్యాలి.

పెళ్ళిళ్లకీ ఇతర శుభకార్యాలకీ, సమావేశాలకీ ఆహ్వాన పత్రికలూ (అందమైన కార్డులు), నూతన సంవత్సరానికి శుభాకాంక్షలు తెలిపే కార్డులూ వస్తూంటాయి ప్రతి ఇంటికీ. చాలా వెడ్డింగ్ కార్డుల మీద వినాయకుడి బొమ్మలూ, బాజాభజంత్రీల

బొమ్మలూ, చుట్టూ అందమైన డిజైన్లలో రంగుల అంచులూ ఉంటాయి. అంతమంచి కార్డ్సని పెల్లయ్యాక పారేసే బదులు అవసరమైన భాగాలు కత్తిరించి అట్టపెట్టెల మీద అంటించి అందంగా తయారుచేసుకోవచ్చు. 'న్యూ ఇయర్ డే' అయిపోయిన కొద్దిరోజుల తరవాత ఆ కార్డ్సల్ని ఇటూ అటూ పారెయ్యకుండా దాచి ఇటువంటి వాటికి ఉపయోగించవచ్చు. అటు పారెయ్యబోయే అట్టపెట్టనీ, ఇటు గ్రీటింగ్ కార్డ్సనీ సద్వినియోగం చేసినట్లవుతుంది. పాత ఉత్తరాల్నీ, చిన్న చిన్న చిల్లర సామానునీ అందంగా అమర్చుకునేందుకు వీలవుతుంది. సెలవురోజుల్లో పిల్లలచేత దగ్గరుండి చేయించవచ్చు. ఇది పెద్దవాళ్లకీ, పిల్లలకీ కూడా ఉపయోగకరమైన కాలక్షేపం అవుతుంది.

(2) పెద్ద అట్టపెట్టలపైన కూడా ముందుగా పాత బట్టని అతికించుకోవాలి పెట్టె చుట్టూరానూ, పెట్టె పైఅంచులోపలి వైపునా, పెట్టె అడుగుభాగం నాలుగు వైపులా దీనికి ఫెవికోల్ వాడితె బోలెడు ఖర్చవుతుంది. కాబట్టి, ముద్దలా ఉడకబెట్టిన మైదాని వాడటం నయం. మైదా ముద్ద మరీ పల్చగానూ, మరీ గట్టిగానూ ఉండకూడదు. మైదా ముద్దలో కొద్దిగా ఫెవికోల్ కలిపితే పురుగు పట్టదు. బట్టని ముడతలు రాకుండా జాగ్రత్తగా అతికించాలి.

పత్రికలూ, ఫైల్సూ పెట్టుకునేందుకైతే, మంచి డిజైన్లు ఉన్న పాత కర్టెన్ బట్టగాని, దుప్పటి బట్టగాని పిల్లల పరికిణీ బట్టగాని వాడితే పెట్టె అందంగా కనిపిస్తుంది. కర్టెన్లూ అవీ కుట్టేటప్పుడు కొంత బట్ట మిగిలితే, ఆ కొత్తబట్టని వాడితే పెట్టె మరింత ఆకర్షణీయంగా ఉంటుంది.

చెత్త కాగితాలు వేసుకునే పెట్టెలపైన ఏదైనా రంగుబట్ట - పాతది వాడొచ్చు. దానిమీద మంచి మంచి బొమ్మలూ, పువ్వులూ, అంచులూ ఉన్న గ్రీటింగ్ కార్డ్సల్నీ, ఇన్విటేషన్ కార్డ్సల్నీ అవసరమైనట్లుగా కత్తిరించి రకరకాల డిజైన్స్‌లో పెట్టె నాలుగువైపులా అంటించాలి. ఎవరి ఊహల్ని బట్టి వారు చిత్రవిచిత్రంగా తయారు చేసుకోవచ్చు. కార్డ్సలు లేకపోతే, న్యూస్‌పేపర్లలో అప్పుడప్పుడు వచ్చే మంచి రంగురంగుల చిత్రాలు - పక్షులూ, పువ్వులూ మొదలైనవి- తీసుకుని పెట్టెమీద అంటించవచ్చు. తయారుచేశాక చెత్తపెట్టె ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది.



# 3. "కొలాజ్" బొమ్మలు

సూది, దారం వాడకుండానూ, రంగులూ, కుంచెలూ వాడకుండానూ పెయింటింగ్‌లా కనిపించే బొమ్మల చిత్రాల్ని తయారుచెయ్యవచ్చు!

వీటికోసం అందమైన రంగురంగుల పాత గ్రీటింగ్ కార్డులూ, ఆకర్షణీయమైన సబ్బుపెట్టెలూ (అట్టవి), బిస్కెట్ పెట్టెలూ (అట్టవి) మొదలైనవి ఉపయోగపడతాయి. అలాగే, అందమైన రకరకాల బట్ట ముక్కల్ని కూడా అతికించి బొమ్మల చిత్రాల్ని తయారు చెయ్యవచ్చు.

పిల్లల పలక పగిలితే, ఫ్రేముని పారెయ్యకుండా దాన్ని చిత్రపటానికి వాడుకోవచ్చు. పల్చగా ఉన్న గోనెబట్ట ముక్కని గానీ, కేస్‌మెంట్ వంటి దళసరి బట్టముక్కని గాని పలక ఫ్రేముమీద పెట్టి, అంచుల్ని వెనకవైపు అతికించాలి ఫెవికోల్‌తో అతికించిన అంచులు కనిపించకుండా పైన ఒక అట్టని అతికించడం మంచిది. గోడకి తగిలించుకోవడానికి వీలుగా వెనకవైపు పైభాగంలో అట్టకి ఒక చిన్న కన్నం చేస్తే మేకుకి తగిలించడానికి వీలవుతుంది. పలకమీద గోనెబట్టని గాని, మామూలు బట్టని గాని అతికించేటప్పుడు ముడతలు లేకుండా ఉండేటట్లు బిగించినట్లు చెయ్యాలి. కావాలంటే వెనకవైపు మరో పల్చని అట్టని అతికించి, పైన ఫ్రేముమీద మరో అట్టనిపెట్టి, దానిమీద బట్టని అతికించవచ్చు.

ఇప్పుడు, అతికించిన బట్టమీద కావలసిన బొమ్మల్ని అతికించుకోవాలి. ముందుగానే పెన్సిల్‌తో గీసుకుంటే పని తేలికవుతుంది. ఏదైనా ప్రింటెడ్ డిజైన్ని అనుసరించవచ్చు. లేదా ఊహించి వేసుకోవచ్చు. ఉదాహరణకి - ఏదైనా అట్టపెట్టెమీది రంగునో, డిజైన్నో చూడగానే ఏదో ఒక ఊహ రావచ్చు. దాన్ని ఆధారంగా చేసుకుని చిత్రాన్ని తయారుచేసుకోవచ్చు. కృష్ణుడి బొమ్మ చెయ్యాలన్నా, చెట్టుబొమ్మ చెయ్యాలన్నా, ఏది చెయ్యాలన్నా దానికి తగిన రంగులున్న అట్టముక్కల్ని కత్తిరించి చిత్రాన్ని తయారు చేసుకోవచ్చు. ముఖాలకీ దుస్తులకీ, అలంకరణకీ మన దగ్గరున్న అట్టముక్కల్లోని రంగుల్నీ, డిజైన్లనీ చమత్కారంగా వాడుకోవడంలోనే మన ఆలోచనా శక్తీ కళాత్మక దృష్టీ ప్రదర్శితమవుతాయి.

ఇటువంటి బొమ్మల్ని పిల్లలచేత సెలవుల్లో చేయించవచ్చు. పిల్లల డ్రాయింగ్ పుస్తకాల్లో రంగులు వెయ్యడానికి 'లైన్ డ్రాయింగ్స్' ఉంటాయి. వాటిమీద రంగుల్ని బ్రష్‌తోవేసే బదులు, పైన చెప్పినట్లుగా అట్టముక్కల్ని కత్తిరించి అతికిస్తే మరింత ఆకర్షణీయంగా ఉంటాయి పిల్లలు ఒకసారి రంగులు వేసి వాడేసిన డ్రాయింగ్ పుస్తకాన్ని చింపి అవతల పారెయ్యకుండా వాటిమీదనే అట్టముక్కల్ని అతికించవచ్చు మళ్ళీ కొత్తరకం బొమ్మలు తయారవుతాయి!



# 4. బొమ్మలకి పూలమాలలు

కాగితాలతో పువ్వులు చేసినట్లుగానే బట్టముక్కలతో కూడా చెయ్యొచ్చు. ఇవి 'వాజ్‌'లో పెట్టుకోవడానికికాదు. బొమ్మల్ని అలంకరించడానికీ, బొమ్మల్ని చెయ్యడానికీ ఉపయోగించవచ్చు.

ముందుగా, బొమ్మలకీ, దేవుడి పటాలకీ ఎప్పటికీ నిలవుండే పూలహారాలు చేసి వెయ్యడం ఎలాగో తెలుసుకుందాం. వీటికి రంగురంగుల బట్టముక్కలు-చిన్నచిన్నవి అవసరం. కొత్తవే అక్కర్లేదు. పాతవి కూడా పనికొస్తాయి. రంగులు బావుంటే చాలు. పల్చనివీ, దళసరివీ అన్నీ పనికొస్తాయి.

పారిజాతాల మాల చెయ్యాలంటే, తెలుపు రంగువీ, 'ఆరెంజ్' రంగువీ బట్టముక్కలు కావాలి. తెలుపువి ఎక్కువా, ఆరెంజ్‌వి తక్కువా అవసరమవుతాయి. తెలుపుకి 'ఫాల్' బట్టలాంటి పల్చని బట్ట ఉండాలి. ఆరెంజ్ కలర్ బట్ట కొంచెం ముతకది, కేస్ మెంట్, పాప్లిన్‌వంటిది కావాలి.

తెలుపు బట్టముక్కలు అంగుళం వెడల్పూ, రెండంగుళాల పొడుగూ ఉండేటట్లుగా కత్తిరించుకోవాలి. వాటి పొడుగు వైపు రెండు పక్కలా 'ఆర్చి'ల్లాగ వంపులుగా కత్తిరించుకోవాలి. నాలుగైదు ముక్కలు బొత్తిగా పెట్టి ఒక్కసారి కత్తిరించుకోవచ్చు.

ఆరెంజ్‌రంగు బట్టని అరంగుళం పొడుగూ అరంగుళం వెడల్పూ ఉండేటట్లు- మరీ చదరంలా అక్కర్లేదు- వంకరటింకరగా అయినా సరే కత్తిరించుకోవాలి. ఏదైనా అంతకుముందు కత్తిరించగా మిగిలిన ముక్కలుంటే త్రికోణాకారంగా ఉన్నవైనా పనికొస్తాయి.

అన్నీ కత్తిరించి పెట్టుకున్న తరువాత, సూదీ, దారం తీసుకుని ఒక ఆరెంజ్ రంగు ముక్క మధ్యగా - ఈ చివరనుంచి ఈ చివరకి కూర్పు తీసినట్లు గుచ్చి, దారంమీదికి ఎక్కించుకోవాలి. తరువాత రెండు తెలుపు రంగు ముక్కల్ని అదేవిధంగా మధ్యగా ఈ చివరనుంచి ఆ చివరికి కూర్పుతీసి దారంమీదికి ఎక్కించుకోవాలి. తెలుపురంగు ముక్కల్ని వంపులుగా కత్తిరించడంవల్ల కూర్పుతీసి దగ్గరికి లాగగానే పువ్వురేకుల్లా కనిపిస్తాయి.

ఆవిధంగా ఒక ఆరెంజ్, రెండు తెలుపు ముక్కల చొప్పున వరసగా గుచ్చుకోవాలి. మాల ఎంత పొడుగ్గా చిక్కగా ఉండాలంటే అన్ని ముక్కలు తయారు చేసుకోవాలి. బొమ్మలకోసం ఇటువంటి మాల చెయ్యాలంటే, బాగా పల్చబడిపోయి చిరిగిపోయిన తెల్లని పాత ధోవతి బాగా పనికొస్తుంది. ఆరెంజ్ కలర్‌కి మాత్రం దళసరి బట్ట కావలసి ఉంటుంది. ఈ మాల అచ్చు పారిజాతాల మాల లాగే సహజంగా కనిపించి అందర్నీ ఆకర్షిస్తుంది.

అలాగే, రంగురంగుల పూలమాలలు చెయ్యాలంటే గులాబీ, ఎరుపు, పసుపు, ఆకుపచ్చ, ఊదా మొదలైన రంగుల బట్టముక్కలూ, తెలుపుమీద చుక్కలూ, పువ్వుల డిజైన్లూ ఉన్న బట్ట ముక్కలూ బావుంటాయి. వీటన్నిటినీ పైన చెప్పిన విధంగానే వంపులుగా కత్తిరించుకోవాలి. దండలావుగా ఉండాలంటే, బట్ట ముక్క వెడల్పు కొంచెం ఎక్కువగా ఉండాలి. పొడుగు తక్కువైతే రెండేసి ముక్కలు వాడొచ్చు. అన్ని రంగుల్నీ ఒక క్రమంలో ఏర్పరచుకుని మాలగుచ్చితే అందమైన కదంబం తయారవుతుంది. వేంకటేశ్వరస్వామికి వేసే మాలలా వస్తుంది. తెలుపు, ఊదా రంగులు మాత్రమే ఉపయోగించి గుచ్చితే డిసెంబరు పూలమాలగా కనిపిస్తుంది.

ఇటువంటి పూల మాలల్ని ఉపయోగిస్తూ వేంకటేశ్వరస్వామి బొమ్మని చేసుకోవచ్చు సులభంగా బతకమ్మ వంటి బొమ్మల్ని కూడా ఆకర్షణీయంగా చేసుకోవచ్చు!

# 5. సీసాతో జోకర్ బొమ్మ

రకరకాల ఖాళీ సీసాలను పెయింట్‌చేసి బొమ్మలుగా చేసుకోవచ్చు.

కొన్ని సీసాల ఆకారాలు బావున్నా, మూతల ఆకారాలు ముఖాలుగా వాడటానికి అంతగా పనికిరావు-మరీ పొట్టి మూతలు కావడంవల్ల అటువంటి సీసాలకు సరిపోయే వేరే మూతలు గాని, ప్లాస్టిక్ పూసలుగాని వాడాలి. వాటిని అతికించడానికి 'బోన్‌ఫిక్స్'వంటి పదార్థాన్ని వాడాలి.

''లిక్విడ్ ఫౌండేషన్'' సీసాలకు మూత గుండ్రంగా ఉంటుంది-తలకాయలా. బొమ్మ గుండెల వరకూ (బ్రస్ట్‌సైజ్‌లో) వస్తుంది. అటువంటి సీసాని ఉన్నది ఉన్నట్లుగా పెయింట్ చేసుకోవచ్చు. కోలగా ఉన్న మూతల్నికూడా ముఖాలుగా వాడొచ్చు. సిరాబుడ్డి కున్న రేకు మూతని తీసి, దాని బదులు వేరే ఎత్తుగా ఉన్న తెల్లని మూతని (పౌడర్ డబ్బా మూత వంటిది) పెట్టి పెయింట్ చేసుకోవచ్చు. అలాగే, షాంపూ సీసాలను కూడా బొమ్మలుగా పెయింట్ చేసుకోవచ్చు. తగినట్లు ముఖాన్ని ఏర్పాటు చేసుకోవడం ముఖ్యం. జోకర్ బొమ్మలూ, రాజుల బొమ్మలూ, రాక్షసుల బొమ్మలూ, ఎన్నోరకరకాలుగా చేసుకోవచ్చు. వీటిని పెయింట్ చెయ్యడానికి 'యాక్రిలిక్ కలర్స్' ('ఫెవిక్రిల్' వంటివి) వాడటం మంచిది. రంగు ఊడిపోదు, పాడైపోదు. త్వరగా ఆరిపోతుంది.

బొమ్మ మూత ఎత్తుగా ఉంటే, దాని మీదే జుట్టులా నలుపురంగుని పెయింట్ చేసుకోవచ్చు. ఎత్తు చాలకపోతే, పైన వేరే పల్చని రేకుమూత వంటిది బోర్లించి అతికి, దానిమీద పెయింట్ చేసుకోవచ్చు.

టోపీ పెట్టాలనుకున్నా, కొప్పు పెట్టాలనుకున్నా, దేనికైనా అందుకు తగిన చిన్నచిన్న వస్తువులను అతికించి పెయింట్ చేసుకోవచ్చు. తెల్లని ఖద్దరు టోపీనిగాని, రంగుల జోకర్‌టోపీనిగాని బట్టతో చేసి అతికించవచ్చు. తరువాత, సీసా మూత (ముఖం) మీద కళ్లూ, నోరూ పెయింట్ చేసుకోవాలి. మరీ చిన్న సీసా అయితే ముక్కుకి ఒక గీత పెయింట్ చేసుకోవాలి. పెద్ద సీసా మూతలకయితే, త్రికోణాకారంలో కత్తిరించిన అట్టముక్కని, అతికించవచ్చు.

సూదీ దారంతో కుట్టడం ఇష్టంలేని వాళ్లూ, పెయింట్ చెయ్యగలిగిన వాళ్లూ సీసాలతో బొమ్మలు చేసి సరదా తీర్చుకోవచ్చు.



# 6. ప్లాస్టిక్‌డబ్బాతో జోకర్ బొమ్మ

చిన్న ప్లాస్టిక్ డబ్బానీ, చిన్న ప్లాస్టిక్‌బంతినిగాని రబ్బరుబంతినిగాని కలిపితే జోకర్‌బొమ్మ తయారవుతుంది. పదిసెంటీమీటర్ల పొడవు ఉండే విటమిన్ మాత్రలుండే ప్లాస్టిక్ డబ్బావంటిది- ఖాళీది కావాలి. పగిలిన రబ్బరు బంతి - నిమ్మకాయ సైజులో ఉండాలి (డబ్బా పెద్దదయితే, బంతి పెద్దదిగా ఉండాలి, ఎక్కువ బట్టకావాలి) రబ్బరు బంతి పిల్లలు ఆడుతూంటే పగిలిపోయినది, పనికిరానిది ఉంటే చాలు - అంతేకాని, పగిలినదే కావాలని నియమంలేదు -'టేబుల్ టెన్నిస్‌బాల్' ని కూడా వాడొచ్చు.

ముందుగా, డబ్బాలో గలగలలాడేందుకు ఏవైనా ప్లాస్టిక్ మూతలు రెండు (టూత్‌పేస్ట్ మూతల్లాంటివి) వేస్తే బావుంటుంది. జోకర్ బట్టలకోసం మంచి రంగులూ డిజైన్లూ ఉన్న బట్టలుంటే బావుంటాయి. ఇంట్లో అవీ ఇవీ కుట్టగా మిగిలినవిగాని, మంచి డిజైన్లున్న పాతబట్ట ముక్కలుగాని వాడొచ్చు. బట్ట మందంగా ఉంటే మంచిది-వాయిలులాగ పల్చగా కాకుండా. అరచేయి అంతమేర గుండ్రని బట్టముక్క ఒకటి (ఏ రంగయినా ఫరవాలేదు) కత్తిరించుకుని, దాని మధ్యలో ప్లాస్టిక్ డబ్బాని పెట్టాలి. బట్ట అంచు చుట్టూ గీతలాగ ఫెవికోల్ పూసి, ఆ అంచుల్ని డబ్బా చుట్టూ అతికించాలి. డబ్బా అడుగున కూడా బట్ట ఉంటుందన్నమాట.

బెత్తెడు మంచిరంగు బట్టముక్కని గుండ్రంగా కత్తిరించుకుని, సూదీ దారంతో బట్టముక్క అంచుచుట్టూ కూర్పుతీసి (లూజ్‌గా టాకాలు వేయడం), బట్టని డబ్బా మూతమీద బోర్లించి, దారాన్ని గట్టిగా బిగించి, చుట్టూ మరోసారి మూతచుట్టూ బట్టని బిగించి కుట్టాలి, ఎక్కడా వదులుగా లేకుండా.

ఇప్పుడు, మంచి డిజైను ఉన్న బట్టని తీసుకుని డబ్బా చుట్టుకొలతకి రెట్టింపు, డబ్బా ఎత్తులోనూ ఉండేటట్లు బట్టని కత్తిరించుకోవాలి. ఆ బట్టముక్క పొడుగునా పైవైపు చిన్నచిన్న 'ఆర్చి'ల్లాగ కత్తిరించుకోవాలి. బట్ట పొడుగునా కిందివైపు ఒక అరసెంటీమీటర్ మేర మడిచి వాడాలి కత్తిరించకుండా. అంచు ఉన్నదైతే మడత అవసరంలేదు. బట్టకింది భాగాన్ని తీసుకుని ప్లాస్టిక్ డబ్బాని తలకిందుగా పట్టుకుని, బట్ట అంచుని డబ్బా అంచుమీదపెట్టి (మడత లోపలికి వచ్చేటట్లు), ఇంతకుముందు






డబ్బా అడుగునుంచి అతికించిన బట్టకి కలిపి కుట్టాలి- పొడుగు బట్టని మధ్యమధ్య కుచ్చెళ్లు పెడుతూ డబ్బా అంచు చుట్టూ అతకాలి. కుచ్చెళ్లు ఎక్కువగా పక్కలకీ, ముందువైపుకీ వచ్చేటట్లు చూసుకోవాలి. డబ్బా వెనకవైపు బట్ట అంచుల్ని డబ్బా పొడుగునా అతకాలి. బట్టపై అంచుని ఒక అంగుళం మేర పైవైపుకి మడిచి, మడత అంచు చుట్టూ కూర్పుతీసి, గట్టిగా బిగించి, కుచ్చెళ్ళను మెడచుట్టూ (మూతమీద అతికించిన బట్టచుట్టూ) సమంగా సర్ది దారం గట్టిగా ముడివేసి మరోసారి చుట్టూ గట్టిగా కుట్టాలి. పైకి మడిచి వదిలిన అంగుళం మేర బట్టా జోకర్ మెడచుట్టూ "ఫేన్"లా వస్తుంది. కత్తిరించిన ఆర్చిలు చుట్టూ వస్తాయి. ఇప్పుడు బంతిని తీసుకోవాలి. జోకర్ ముఖానికి తెలుపురంగు బట్టని తీసుకోవాలి. బంతి కిందనుంచి పై వరకూ బట్టను రెండు అంచులూ కలిసేటట్లు పెట్టి సరిపడేటంత కత్తిరించుకోవాలి. వెడల్పులో కూడా బంతి పక్కల్ని అంచులు రెండూ కలిపి కుట్టేటంత ఉండాలి ఎక్కువ బట్ట మిగిలితే ముడతలు ఎక్కువవుతాయి.

కత్తిరించుకున్న బట్టముక్కతో బంతిని చుట్టి, అతుకు బంతి నడినెత్తిమీదికి వచ్చేటట్లు చూసుకుని, బట్టముక్క అంచుల్ని బంతి పైభాగంలో ముందుగా అతకాలి. సూది బంతిలోకి పోకూడదు. బట్టని బిగించి కుట్టాలి. పైన కుట్టిన తరవాత, పక్కల్ని అంచులు కలుపుతూ కుట్టాలి. పక్క అతుకులు చెవుల వైపు ఉండేటట్లు కుట్టాలి. ముఖంమీద ఎక్కడా ముడతలు రాకుండా చూసుకుంటూ పక్కలనున్న బట్టని సూదీదారంతో మెల్లమెల్లగా వెనక్కిలాగుతూ కుట్టాలి. మెడ ముందువైపు కూడా ఇటూ అటూ ముడతలు రాకుండా బట్ట మడతల్ని వెనకవైపుకి లాగుతూ కుట్టాలి.

తరువాత, నలుపురంగు బట్టనిగాని, ఫెల్ట్‌నిగాని తీసుకుని జోకర్ జుట్టులాగ నుదుటి నుంచి చెవుల కింది వరకూ, వెనక మెడవరకూ కుట్టాలి. ముందు వైపు క్రాఫింగ్‌లాగ మరికొంత నలుపు బట్ట పీలికని మడతలు పెడుతూ కుట్టాలి.

అప్పుడు జోకర్ తలని బట్టలు కుట్టిన ప్లాస్టిక్ డబ్బామూత మీద మధ్యన పెట్టి, తల ఆనిన భాగంమీద కొంచెం ఫెవికోల్ పూసి, తలని నొక్కిపెట్టి, ఆనిన భాగం చుట్టూ తలనీ మూతనీ కలిపి కుట్టాలి. సూదీ దారాన్ని ఒకసారి మూతమీది బట్టలోంచీ, ఒకసారి తలకింద బట్టలోంచీ పోనిస్తూ రెండుమూడు చుట్లు కుట్టాలి. గట్టిగా కదలకుండా ఉండేటట్లు.

తరవాత జోకర్ టోపీ చేసుకోవాలి. బొమ్మలో చూపించినట్లుగా, జోకర్ తలచుట్టూ గుండ్రంగా ఉండి, పైకిపోనుపోను ఒక పక్కకి కిందికి బాగా వంపు తిరిగి ఉండాలి. జోకర్ టోపీకి బావుండే బట్ట జానెడు ముక్కని తీసుకుని మధ్యకి మడిచి, బొమ్మలో చూపించిన ఆకారంలో కత్తిరించుకోవాలి. మడిచిన ముక్కల్ని కిందివైపు వదిలేసి తక్కిన రెండువైపులా అతుక్కోవాలి. కింది అంచుని చుట్టూ లోపలికి మడిచి కుట్టుకోవాలి-పోగులు కనిపించకుండా. చుట్టూ ఏదైనా లేస్‌గాని, అంచుగాని కుచ్చెళ్లుపోసి అమరిస్తే బావుంటుంది. టోపీని జోకర్ తలమీద అమర్చి, చుట్టూ కుట్టాలి ఇటూ అటూ కదిలిపోకుండా టోపీ పైకొసకి చిన్న కుచ్చు వ్రేలాడేటట్లు చిన్న బట్టముక్కని త్రికోణాకారంలో మడిచి కుట్టాలి.

ఇప్పుడు, జోకర్ ముక్కు తయారు చెయ్యాలి. ఎరుపురంగుది చిన్న బట్టముక్క (పల్చనిది) తీసుకుని మడిచి, చిటికెన వేలు వెడల్పున ఇంగ్లీషు 'యు' ఆకారంలో కత్తిరించుకోవాలి. దాని చుట్టూ మూడువైపులా చిన్నకుట్టుతో గట్టిగా కుట్టుకుని, మంచివైపుకి తిరగేసి, కొసలన్నిటినీ లోపలికి తోసెయ్యాలి. అప్పుడది గట్టిగా కోలగా ఉంటుంది. దాన్ని జోకర్ ముక్కులాగ పెట్టి, ఆ ఉండ చుట్టూ ముఖంమీద అతకాలి.

బట్టతో ముక్కుచేసే బదులు, ఎర్రటి పూస ఉంటే దాన్ని కుట్టినా బావుంటుంది.

ఇక ఆఖరున జోకర్ ముఖంమీద కళ్లూ, నోరూ, బుగ్గలూ ఫాబ్రిక్ పెయింట్స్‌తోగాని, పోస్టర్ కలర్స్‌తోగాని పెయింట్ చెయ్యాలి. (రంగులు పల్చగా ఉండకూడదు. బ్రష్ సన్నగా ఉండాలి). ఫాబ్రిక్ పెయింట్ అయితే తడి తగిలినా పోదవదు.

ఈ బొమ్మ బుట్టబొమ్మలా కుచ్చెళ్లతో ఉంటుంది కాబట్టి చేతులు పెట్టకపోయినా ఫరవాలేదు బావుంటుంది. దీన్ని రెండు మూడు గంటల్లో చేసెయ్యొచ్చు. పిల్లలకీ పెద్దలకీ కూడా ఆకర్షణీయంగా ఉంటుంది. ఖర్చు లేకుండా తయారుచేసే బొమ్మ.

# 7. బట్టపూలతో జోకర్ బొమ్మ

ఈ బొమ్మ నిలబడే బొమ్మకాదు. వేళ్లాడదీసే బొమ్మ. పిల్లల ఉయ్యాలపైనా, కిటికీ తెరల మధ్యనా, ఎక్కడైనా వేళ్లాడదీసుకోవచ్చు. చంటిపిల్లలకి ఆడుకోవడానికివ్వడానికి కూడా బావుంటుంది. ఈ బొమ్మ పిల్లల్నీ పెద్దల్నీ కూడా ఆకట్టుకుంటుంది.

ఈ బొమ్మ చేయడానికి కనీసం 47 పువ్వులుండాలి. ఆకట్టుకునే రంగుల్లోనూ డిజైన్లలోనూ ఉన్న దళసరి నూలు బట్ట ముక్కలు బావుంటాయి. నైలాన్ బట్ట వాడితే పోగులు ఊడొస్తాయి. వాయిల్ వంటి పల్లచని బట్ట అయితే పువ్వులు ఎక్కువ పడతాయి. త్వరగా నలిగిపోవచ్చు. అందుకని పాత పరికిణీ బట్టలూ, గౌను బట్టలూ, షర్టు బట్ట వంటివి ఉపయోగించుకోవచ్చు. కొత్తవైతే కేస్‌మెంట్, పాప్లిన్ వంటి బట్ట బావుంటుంది. చేతులకీ, కాళ్లకీ ఏయే రంగులూ డిజైన్లూ వాడాలో ముందే నిర్ణయించుకోవాలి. పొడుగు చేతుల చొక్కా, పాంటూ వేసుకున్నట్లుగా ఉంటుందీ బొమ్మ. మొత్తం ఒకే రంగూ, డిజైనూ వాడితే, మెడ దగ్గరా, నడుము దగ్గరా, చేతుల చివరా, కాళ్ల చివరా వేరే రంగు వాడితే బావుంటుంది. జోకర్ టోపీకి కూడా తగిన బట్ట ముక్క ఉండాలి.

ఇవికాక, ముఖానికి తెలుపురంగు బట్టముక్క కావాలి. జుట్టుకి నలుపురంగు బట్టముక్క కావాలి. తలకు "పింగ్‌పాంగ్ (టేబుల్‌టెన్నిస్) బాల్" కావాలి. ఇది చిన్న నిమ్మకాయ సైజులో తెల్లగా ఉంటుంది. చవక రకంది చాలు. పిల్లల బొమ్మల దుకాణాల్లో దొరుకుతుంది. ఇత్తడి మువ్వలు 4 కావాలి. గోలీకాయకన్నా చిన్న సైజులో ఉండాలి. ఇత్తడి వస్తువులమ్మే దుకాణంలో దొరుకుతాయి.

బట్టముక్కల్ని 31/2 అంగుళాల పొడుగూ, 31/2 అంగుళాల వెడల్పూ ఉండేట్లు, ముందు చదరంగా కత్తిరించి, తరవాత గుండ్రంగా వచ్చేటట్లు కొసలు కత్తిరించాలి. గుండ్రని బట్టముక్క అంచుమీద చుట్టూ గట్టి దారంతో కూర్పు తీసి దగ్గరగా లాగి ముడి వెయ్యాలి. కుచ్చెళ్ల చుట్టూ ఉన్న బట్టని సరిగ్గా సర్ది కొద్దిగా అణిస్తే పువ్వులా వస్తుంది.

అయిదు పువ్వుల్ని మాత్రం కొంచెం పెద్దగా (4"×4") వచ్చేట్లు కత్తిరించుకుని కుట్టాలి. వీటిని శరీరం మధ్య భాగానికి ఉపయోగించాలి. అన్ని పువ్వులూ తయారయ్యాక, వాటితో బొమ్మ చేతులూ, కాళ్లూ, మధ్యభాగం తయారు చెయ్యాలి.

ఒక ఇత్తడి మువ్వని ఒక పువ్వు మధ్య (కుట్టులేనివైపు) పెట్టి, మువ్వ కొక్కెంలోంచి సూదీదారం పోనిచ్చి పువ్వుకి గట్టిగా అతకాలి-పైనుంచి కిందికి రెండు మూడు టాకాలువేసి కుట్టాలి. మువ్వ వేళ్లాడేటట్లు పువ్వుని పెట్టుకుని, అదే దారానికి 8 పువ్వుల్ని ఒకదాని మీద ఒకటి దగ్గరగా గుచ్చాలి - పువ్వు మధ్యలో 'కుట్టు లేని వైపు నుంచి ఉన్నవైపునకు' గుచ్చాలి. తరవాత, ఒక పువ్వుని సగానికి మడిచి పట్టుకుని బొడ్డులోంచి (పువ్వు మధ్యకు కుచ్చెళ్లు కలిపి కుట్టిన భాగంలోంచి) గుచ్చాలి. తరవాత మళ్లీ 9 పువ్వుల్ని "బొడ్డులోంచి కుట్టులేని వైపునకు" గుచ్చి, ఆఖరి పువ్వు మధ్య భాగం మీద ఇత్తడి మువ్వని పెట్టి గట్టిగా కుట్టాలి. ఈ మువ్వ నుంచి ఆ మువ్వ వరకూ మరోసారి పువ్వుల మధ్య నుంచి సూదీ దారాన్ని పోనిచ్చి, అటువైపు ముడి వేసెయ్యాలి. దండ గట్టిగా బిగువుగా ఉండాలి.

అలాగే, కాళ్లకి కూడా మువ్వలూ, పువ్వులూ గుచ్చాలి-ఒక మువ్వ, 11 పువ్వులూ, మధ్యలో మడిచిన పువ్వు, మళ్లీ 11 పువ్వులూ, ఒక మువ్వ - ఈ క్రమంలో గుచ్చి ముడి వెయ్యాలి. మిగిలిన పువ్వుల్ని బొమ్మ మధ్య భాగానికి ఉపయోగించాలి. సూదీ దారాన్ని 'కాళ్ల దండ'మధ్య నున్న మడిచిన పువ్వు మధ్యలో గుచ్చి (క్రింద నుంచి పైకి) అక్కడి నుంచి 4 పెద్ద పువ్వుల్ని

ఒకదానిమీద ఒకటి దగ్గరగా (పువ్వుకి కుట్టులేని వైపు నుంచి ఉన్నవైపునకు) గుచ్చాలి. తరువాత సూదీ దారాన్ని 'చేతుల' దండ మధ్య నున్న మడిచిన పువ్వు మధ్యలోంచి పోనిచ్చి, పైన ఒక పువ్వుని గుచ్చి బిగించి ముడివెయ్యాలి.

ఇప్పుడు బొమ్మ తలని తయారు చేసుకోవాలి. 3 అంగుళాల వెడల్పూ, 41/2 అంగుళాల పొడుగూ ఉన్న తెలుపురంగు బట్ట ముక్కని తీసుకుని, దాన్ని నిలువుగా పెట్టి, మధ్య పింగ్‌పాంగ్ బాల్‌ని పెట్టి, నిలువు వైపు బట్ట అంచులు రెండింటినీ కలిపి బాల్ నెత్తి మీదికి వచ్చేట్టు కుట్టాలి. కుట్టే ముందు బాల్ మీది గీత (అతుకు) బొమ్మ ముఖం మీదికి రాకుండా చూసుకోవాలి. తరువాత, బాల్‌కి రెండువైపులా మిగిలిన బట్టని ఇటూ అటూ వెనక వైపునకు మడిచి, వెనకనున్న బట్టకి కలిపి అతకాలి. ముందువైపు ఎక్కడా ముడతలు రాకుండా చూసుకుని, ముడతల్ని వెనక్కి లాగి కుట్టాలి.

ఇప్పుడు, నలుపు రంగు బట్ట ముక్కని తీసుకోవాలి. 31/2 అంగుళాల వెడల్పూ, 10 అంగుళాల పొడుగూ ఉండే ముక్కని తీసుకుని, పొడుగునా ఒకవైపు ఒక సెంటీమీటర్ వెడల్పున కిందికి మడిచి, ఆ మడతని బాల్ నెత్తిమీద పెట్టాలి. కొనలు ఇటూ అటూ సమంగా వేళ్లాడేటట్లు పెట్టాలి. నెత్తిమీద పెట్టిన నల్ల బట్టకి టాకాలువేసి, తరువాత పక్కల్ని వేళ్లాడుతున్న బట్టకి చెంపల కింది వరకూ టాకాలు వెయ్యాలి. మిగిలిన బట్టని పైకి వదులుగా మడిచి, కొనల్ని నెత్తిమీద 'క్రాఫ్'లా వచ్చేటట్లు మడిచి కుట్టాలి. తరువాత, వెనకనున్న బట్టని మెడ కిందివరకూ వచ్చేటట్లు పెట్టి టాకాలు వేసి, మిగిలిన బట్టని పైకి మడిచి అవసరమైనచోట్ల టాకాలు వెయ్యాలి.

ఇంతకు ముందు కుట్టి ఉంచుకున్న పువ్వుల దండలో-శరీరం మధ్య భాగానికి పైన కుట్టిన పువ్వుని తలకింద (మెడదగ్గర) పెట్టి, తలనీ పువ్వునీ కలిపి పువ్వు బొడ్డు చుట్టూ అతకాలి - సూదీ దారాన్ని ఒకసారి తలకింది బట్టలోంచి, ఒకసారి పువ్వు బొడ్డు కుచ్చెళ్లలోంచి పోనిస్తూ, బొడ్డు చుట్టూ రెండుసార్లు బిగిస్తూ అతకాలి (చేతులవీ, కాళ్లవీ పువ్వుల దండలు బిగువుగా గట్టి దారంతో గుచ్చితే, మెలికలు తిరక్కుండా సరిగ్గా వేళ్లాడతాయి. మధ్యభాగంలో పువ్వులు కూడా దగ్గరగా ఉండాలి).

ఇప్పుడు టోపీ కుట్టుకోవాలి. ఒక దళసరి బట్టముక్కని (మంచి రంగూ, మంచి డిజైనూ ఉన్నది) 5 అంగుళాల పొడుగూ, 3 అంగుళాల వెడల్పూ ఉండేటంత కత్తిరించుకుని, మధ్యకి మడిచి, మామిడి పిందె ఆకారంలో కత్తిరించుకోవాలి. రెండు ముక్కల్నీ కలిపి, కింది భాగాన్ని వదిలేసి తక్కిన అంచు చుట్టూ గట్టి కుట్టుతో అతకాలి. దాన్ని తిరగేసి, బొమ్మ నెత్తిమీద టోపీలా పెట్టి, కింది అంచుని కొద్దిగా లోపలికి మడుస్తూ తల చుట్టూ జుట్టుకి (నలుపు బట్టకి) అతకాలి. చుట్టూ లేసు కుచ్చెళ్లలా కుట్టాలి. తరువాత, టోపీ పైన కొస దగ్గర ఊలుతోనో, చిన్న బట్టముక్కతోనో కుచ్చులాగా కిందికి వేళ్లాడేటట్లు కుట్టాలి. టోపీ పైన, మధ్యలో పట్టుకునేందుకు గట్టి దారంతో గొలుసులా కుట్టాలి.

ఇప్పుడింక, ముఖం మీద పెన్సిల్‌తో కనుబొమలూ, కళ్లూ, నోరూ జోకర్‌కి ఉండేలా గీసుకోవాలి. కనుబొమలు పైకి లేచినట్లుగా బాగా వంపుగా గీసుకోవాలి. కళ్లు ఒకవైపునకు చూస్తున్నట్లు వేసుకుంటే బావుంటుంది. నోరుని అర్ధచంద్రాకారంలో 'నెలవంక'లా వేసుకోవాలి. ముక్కు ఉండవలసిన చోట కింది భాగంలో ఒక చిన్న సున్నా గీసుకోవాలి. ఆ సున్నా మీద ఎర్రటి పూసని కుట్టాలి - పూస కన్నాలు పక్కలకి వచ్చేటట్లు కుట్టాలి. లేదా, బట్టముక్కని ఉండలా చేసి కుట్టుకోవచ్చు.

ఫాబ్రిక్ పెయింట్స్ వేస్తున్నప్పుడు, పెదవులు రెండింటికీ సన్నగా ఎరుపురంగు వేసి, మధ్యన తెలుపు రంగుతో పెయింట్ చేస్తే బాగా నవ్వుతున్నట్లు కనిపిస్తుంది. కళ్లు ఒకవైపునకు చూస్తున్నట్లు వెయ్యడం వల్ల కొంటెగా నవ్వుతున్నట్లు ఉంటుంది. బొమ్మని ఇటూ, అటూ కిందికి పైకీ ఊగిస్తే మువ్వలు గలగల మంటూ ఆహ్లాదం కలిగిస్తాయి.

# 8. బట్టపూలతో బతకమ్మ

నెత్తిమీద బతకమ్మని పెట్టుకున్న స్త్రీ బొమ్మని చెయ్యడానికి కొబ్బరిచిప్ప, సీసామూత, బంతి, రంగురంగుల బట్టముక్కలూ, చంకీ లేసులూ ఉండాలి. ఒక అట్టముక్క కూడా ఉండాలి.

ఈ బొమ్మ పొడుగ్గా ఉండదు. గుండెల వరకూ ఉంటుంది. చేతులు పెట్టక్కర్లేదు, ఉన్నట్లుగానే అనిపిస్తుంది. కొబ్బరిచిప్ప కొంచెం ఎత్తుగా కోలగా ఉండాలి. సీసా మూత అంగుళం వెడల్పు ఉన్నది - రేకుదిగాని, ప్లాస్టిక్‌ది గాని ఉండాలి. బంతి తేలిగ్గా ఉండే రబ్బరు బంతిగాని, ప్లాస్టిక్ బంతిగాని పనికొస్తుంది. చిన్న సైజుది వెలక్కాయ డొల్ల అయినా బావుంటుంది. రంగురంగుల బట్టముక్కలు - కొత్తవీ, పాతవీ అన్నీ పనికొస్తాయి.

ముఖానికీ, మెడకీ గంధం రంగులోనో, లేత, ఇటుక రంగులోనో ఉండే బట్ట బావుంటుంది. బంతిని కప్పి కుట్టడానికి 5 అంగుళాల వెడల్పూ, 8 అంగుళాల పొడుగూ ఉన్న బట్ట ముక్క కావాలి. సీసామూతని కప్పి కుట్టడానికి బెత్తెడు ముక్కచాలు. జుట్టుకి నలుపురంగు బట్టముక్క - 10 అంగుళాల పొడుగూ, 8 అంగుళాల వెడల్పూ ఉండేది కావాలి. జాకెట్టు లాగ కొబ్బరిచిప్ప చుట్టూ కుట్టడానికి 10 అంగుళాల పొడుగూ, 10 అంగుళాల వెడల్పూ ఉన్న బట్ట ఏ రంగుదైనా, చిన్నపువ్వులూ, చుక్కలూ ఉన్నదైనా బాగానే ఉంటుంది. ఆకర్షణీయంగా, చీర పమిటకి నప్పేటట్లుగా ఉండాలి. చీర పమిటకి 10 అంగుళాల పొడుగూ, 8 అంగుళాల వెడల్పూ ఉన్న బట్టముక్క జాకట్టుకి తగిన రంగులో కావాలి. దానికి ఇటూ అటూ అంచులా కుట్టడానికి ఒక అంగుళం వెడల్పూ, 10 అంగుళా పొడుగూ ఉన్న బట్టముక్క ఉండాలి. రెండు వైపులా అంచుఉన్న బట్ట ఏదైనా ఉంటే, దాన్నే కావలసిన విధంగా కుట్టుకోవచ్చు వేరే ప్రత్యేకంగా అంచు అతక్కుండా పెద్ద అంచున్న బట్ట అయితే కిందివైపుకి పెట్టి కుట్టినా బావుంటుంది.

జాకెట్టు కోసం ఎంచుకున్న బట్టని 10 అంగుళాల పొడుగూ 10 అంగుళాల వెడల్పూ ఉండేటట్లు గుండ్రంగా కత్తిరించుకోవాలి. దాని అంచు చుట్టూ గట్టి దారంతో కూర్పుతీసి, మధ్యలో కొబ్బరిచిప్పని వెల్లకిలా పెట్టి దారాన్ని బిగించాలి. బట్ట కుచ్చెళ్లని కొబ్బరిచిప్ప అడగున సమంగా చుట్టూ సర్ది గట్టిగా ముడివెయ్యాలి. మధ్యలో కొంచెం ఖాళీ వచ్చినా ఇబ్బందిలేదు - అట్ట ముక్కని అతికిస్తాం కాబట్టి.

కొబ్బరి చిప్పని ఒక దళసరి అట్టమీద బోర్లించి, చుట్టూ పెన్సిల్‌తో గీత గీసుకుని, ఆ గీత ప్రకారం కత్తిరించుకుంటే సరిగ్గా కొబ్బరిచిప్పకి సరిపడ అట్టముక్క వస్తుంది. ఆ అట్టముక్కకన్న కొంచెం పెద్ద బట్ట ముక్కని (ఏ రంగుదయినా సరే) కత్తిరించుకుని, అట్టమీద ఫెవికోల్‌తో అతికించి, చుట్టూ మిగిలిన అంచుల్ని రెండో వైపుకి మడిచి అతికించాలి. అతికించిన అంచుల మీద ఫెవికోల్‌పూసి, కొబ్బరి చిప్పని బోర్లించి అతికించాలి.

ముఖం రంగు బట్ట ముక్కని, రెండున్నర అంగుళాల పొడుగూ, అంతే వెడల్పూ ఉండేలాగ గుండ్రంగా కత్తిరించుకుని, దాని చుట్టూ అంచుమీద కూర్పుతీసి, మధ్యలో సీసామూతని వెల్లకిలాపెట్టి, దారం బిగించి, కుచ్చెళ్లని దగ్గరికి లాగి, దారం గట్టిగా ముడివెయ్యాలి. బట్టకుట్టిన ఆ సీసామూతిని, అంచులు కుట్టిన వైపు కొబ్బరిచిప్ప మీదికి వచ్చేటట్లు బోర్లించి, రెండింటినీ కలిపి అతకాలి - సూదీ దారాన్ని ఒకసారి కొబ్బరిచిప్ప మీద బట్టలోంచీ, ఒకసారి మూత అంచుమీది బట్టలోంచీ పోనిస్తూ, మూతచుట్టూ కొబ్బరిచిప్పకి అతుకుతూ కుట్టాలి.

ఇప్పుడు బంతిని తీసుకుని, ముఖం రంగు బట్టతో కప్పి కుట్టాలి. బట్ట ముక్కని నిలువునా పెట్టుకుని, మధ్యభాగం కన్నా కొంచెంపైన బంతిని పెట్టి, బట్టకొసలు మడతపెట్టి గట్టిగా అతకాలి. తరవాత, పక్కలనున్న బట్టని బంతి వెనకవైపుకి మడిచి, వెనకనున్న బట్టకి అతకాలి. ముందువైపు ముడతలు రాకుండా, ముడతల్ని వెనకవైపుకి సూదీదారంతో లాగుతూ కుట్టాలి.

తరవాత, నలుపురంగు బట్టని తీసుకుని, పొడుగులో ఒకవైపు అంచుని ఒక సెంటీమీటర్ మేర లోపలికి మడిచి, ఆ మడత మధ్యభాగాన్ని బంతిమీద (నుదుటి పైభాగంలో) పెట్టి, నలుపు దారంతో టాకాలు వెయ్యాలి. ఇటూ అటూ వేళ్లాడుతున్న బట్టని చెంపల కిందివరకూ అతుకుతూ టాకాలు వెయ్యాలి. మిగిలిన బట్టని బంతివెనక వైపుకి తిప్పుకుని, కొంచెం పైకి మడచి టాకాలు వెయ్యాలి. వెనక వైపు మధ్యలో ఉన్న బట్టని మెడ కిందివరకూ అతికి, మిగిలిన బట్టని పైకి పెట్టి కదలకుండా టాకాలు వెయ్యాలి. అప్పుడు, బట్ట కొసలన్నిటిని కలుపుకుంటూ ముడిలా కనిపించేటట్లు తలవెనక మధ్యలో కదిలిపోకుండా టాకాలు వేస్తూ కుట్టాలి.

ఇప్పుడు ముక్కు తయారుచేసి, ముఖం మీద అతికించాలి. ఒక చిన్న అట్టముక్కని ('ఫాల్' లోపలి అట్ట వంటిది) తీసుకుని, మధ్యకి మడచి, ముక్కోణాకారంలో చిన్నముక్కని కత్తిరించుకోవాలి. కిందివైపు పక్కనున్న కొసల్నికొద్దిగా వంపుగా ఒక్క పిసరు కత్తిరించాలి. మడత తెరిచి, కొంచెం దగ్గరగా నొక్కి పట్టుకుంటే ముక్కులా కనిపిస్తుంది. సైజు సరిగ్గా ఉందోలేదో (మరీ పెద్దగా, మరీ చిన్నగా కాకుండా) చూసుకోవాలి.

ఆ అట్టముక్క కన్నా కొంచెం పెద్దగా అదే ఆకారంలో ముఖం రంగు బట్ట ముక్కని కత్తిరించుకుని, ఆ బట్టముక్క మధ్యలో అట్టముక్కని పెట్టి, దాని మీద ఫెవికోల్ కొద్దిగా పూసి, బట్ట అంచుల్ని లోపలికి మడిచి అతికించాలి. అతికిన అంచులమీద (ముక్కు లోపలివైపు) మళ్లీ కొంచెం ఫెవికోల్ పూసి, బొమ్మ ముఖంమీద ముక్కు ఉండవలసిన చోట అతికించాలి. అతుక్కునే వరకూ కొంచెం నొక్కి పట్టుకుని వదిలెయ్యాలి. ఆరిన తరువాత చాలా గట్టిగా అయిపోతుంది. ముఖం మీద ముందుగా పెన్సిల్‌తో బొట్టూ, కనుబొమలూ, కళ్లూ, ముక్కూ, నోరూ తేలికగా గీసుకుంటే, ముక్కుని సరియైన స్థానంలో అతికించడం తేలికవుతుంది.

ఇప్పుడు, జాకెట్టు మీద చీర పమిటని కుట్టాలి. పమిటకోసం ఎంచుకున్న బట్ట ముక్కని తీసుకుని, దీని వెడల్పులోనూ. రెండు అంచుల పొడుగునా ఏదైనా డిజైను ఉన్న అంచుని అంగుళం వెడల్పులో అతకాలి. పమిటపై అంచుని కొబ్బరిచిప్ప కిందివైపు ఒక అంగుళంపైన - ఎడమపక్కగా అతకాలి. ఆ అంచునిపైకి - మెడకింది వరకూ తీసుకువెళ్లి అక్కడ నుంచి భుజం మీదుగా వెనకవైపుకి తిప్పి, కదిలిపోకుండా టాకాలు వెయ్యాలి. తరవాత, పమిట రెండవ అంచుని కూడా ఎడమపక్క కిందివైపు - ఇంతకు ముందు కుట్టిన అంచుకి కింద - కొబ్బరిచిప్ప అంచుకిపైన అతకాలి. పమిటని మధ్యలో ఒకటి రెండు కుచ్చెళ్లలా మడతలు పెట్టి, కింది అంచుని కొబ్బరిచిప్ప చుట్టూ (కిందివైపు) అవసరమైన చోట్ల టాకాలు వేస్తూ అతికించాలి. మిగిలిన పమిటని వెనకనుంచి మళ్లీ ముందుకి (అంచు మొదలు పెట్టిన చోటికి) వచ్చేటట్లు తిప్పి, అక్కడ అతకాలి. వెనకవైపు మడతలు వచ్చినచోట టాకాలు వెయ్యాలి. ఈ బొమ్మకి చేతులు పమిటకింద ఉన్నట్లుగా అనిపిస్తుంది కొబ్బరిచిప్పవల్ల.

ఇక ఆభరణాలతో ముస్తాబు ప్రారంభించాలి. చెవులకు పెద్ద దిద్దులూ (కమ్మలు), ముక్కుపుడక, మెడ చుట్టూ రకరకాల గొలుసులకు- నల్లపూసల గొలుసుతోపాటు, రకరకాల సన్నని చంకీలేసులూ, చంకీ బిళ్లలూ, పూసలూ వాడాలి. ముక్కుపుడకలా బంగారం రంగులో చిన్న చంకీ బిళ్ల ఫెవికోల్‌తో అతికించి, దానిమీద ఎర్రని చిన్నపూస అతికించాలి. గొలుసులు కుట్టుతో అతుక్కోవాలి. తలలో సిగచుట్టూ మల్లెపువ్వుల మాల ఉన్నట్లు బట్టముక్కల్ని వంపులుగా కత్తిరించి దగ్గరగా కూర్పుతీసి కుట్టిపెట్టాలి

ఇప్పుడు, పువ్వులతో బతకమ్మని చెయ్యాలి. దీనికి పాత బట్టముక్కలు పనికొస్తాయి - 4 అంగుళాల పొడుగూ, 4 అంగుళాల వెడల్పూ ఉన్న ఆకుపచ్చరంగు బట్టముక్కని కత్తిరించుకోవాలి. దాన్ని నాలుగు మడతలు వేసి ముందు, గుండ్రంగా వచ్చేట్లు కత్తిరించుకుని, తరవాత, చుట్టూ ఆకుల్లా కనిపించేట్లు వంకులుగా కత్తిరించుకోవాలి. బట్ట మరీ పల్చగా ఉంటే రెండు పొరలు వాడాలి ఆకుపచ్చ బట్టముక్కని గుండ్రని అట్టముక్కమీద అతకాలి.

'ఆకుల' మీద పువ్వులు పెట్టాలి. పసుపురంగు బట్టముక్కల్ని అంగుళం వెడల్పూ, రెండంగుళాల పొడుగూ ఉండేట్లు కత్తిరించుకోవాలి. వాటి రెండు వైపుల అంచుల్నీ పొడుగునా వంపులుగా కత్తిరించుకోవాలి. కనీసం ఓ పదిపన్నెండు ముక్కలు కావలసి ఉంటుంది. అన్నింటినీ ఒక్కొక్కటి చొప్పున ఈ చివర నుంచి ఆ చివరికి 'వెడల్పు'లో మధ్య నుంచి సూదీ దారంతో కూర్పు తీసినట్లు గుచ్చుకోవాలి. దగ్గరికి లాగితే పువ్వుల దండలా కనిపిస్తుంది. ఆ దండని గుండ్రంగా ఆకుపచ్చ బట్టమీద (ఆకుల చివర్లుపైకి కనిపించేటట్లు వదిలి) - సరిగ్గా సరిపోయిందో లేదో చూసుకుని, అవసరమైతే ఒకటి రెండు ముక్కలు చేర్చో, తీసేసో చేసి, దండ రెండు కొసల్నీ కలిపి ముడివెయ్యాలి. ఆ దండని ఆకుపచ్చ బట్టకి అతకాలి అక్కడక్కడ టాకాలు వేసి.

తరవాత మరో రంగు బట్ట ముక్కలతో పసుపురంగు పువ్వుల దండకన్నా కొంచెం చిన్న దండని చేసుకోవాలి. అలాగే రకరకాల రంగులతో ఒకదానికన్నా మరొకటి చిన్నగా దండల్ని చేసుకుని, పైన శిఖరానికి వచ్చినప్పుడు ఒక్కటే పువ్వుని పెట్టినట్లు - రెండు మూడు ముక్కల్తో గుత్తిలా చేసి పెట్టుకోవాలి. మొత్తం ఆకుల పళ్లెంతో కలిపి శిఖరం వరకూ పువ్వుల గోపురంలా కనిపిస్తుంది. దండలు ఇటూ అటూ కదిలిపోకుండా టాకాలు వేసుకోవాలి.

పువ్వుల గోపురాన్ని బొమ్మ తలమీద పెట్టి, కొంచెం ఫెవికోల్‌తో ఆకులకింద పెట్టిన అట్టని తలకి అతికించాలి. ఊడిపోకుండా, కుట్లు ఎక్కువ కనిపించకుండా తలమీద నల్లబట్టలోంచి ఒకసారీ, ఆకుల మధ్యనుంచి ఒకసారీ సూదిని పోనిస్తూ కుట్టుతో గట్టిగా చుట్టూ అతకాలి.

ఆఖరున, బొమ్మ ముఖం మీద బొట్టు, కనుబొమలూ, కళ్లూ, నోరూ ఫాబ్రిక్ పెయింట్స్‌తో పెయింట్ చేసుకోవాలి. సన్నని బ్రష్ ఉపయోగించి ఎరుపు బొట్టు గ్రుండంగా పెద్దదిగా పెట్టాలి. దానికింద కనుబొమల మధ్య నల్లని చుక్కపెడితే ఈ బొమ్మకి బావుంటుంది. కళ్లు కూడా పెద్దవిగా పెయింట్ చేస్తే ముఖం కళకళలాడుతుంది.



# 9. బట్టపూలతో 'బ్రైడ్'

తెలుపు రంగు బట్టతో పువ్వులు చేసి, ఆ పువ్వుల్ని ఉపయోగించి 'క్రిస్టియన్ బ్రైడ్' బొమ్మని చెయ్యొచ్చు. దీన్ని నిలబడే బొమ్మలా చేసుకోవచ్చు. ఒక ప్లాస్టిక్ డబ్బానీ, 'ఫింగ్ పాంగ్ బాల్'నీ ఉపయోగించాలి.

చేతులకి పువ్వుల దండల్నీ తక్కిన భాగానికి ప్లాస్టిక్ డబ్బానీ ఉపయోగించాలి. బొమ్మ కింద నుంచి మెడవరకూ 7 అంగుళాల పొడుగు ఉండేట్లు డబ్బాని ఎంచుకోవాలి. (సీసాని కూడా వాడుకోవచ్చు జాగ్రత్తగా ఉంచగలిగితే). డబ్బా పొట్టిగా ఉంటే మరో చిన్న డబ్బాని గాని మూతని గాని జోడించవచ్చు పైనగాని, కిందగాని. బొమ్మమెడ సన్నగా ఉండటానికి డబ్బా మూత మీద ఎత్తునిబట్టి ఒకటి రెండు చిన్న రబ్బరు వాషర్లను ఉపయోగించాలి. చిల్లుపడిన 'సేఫ్టీవాల్వ్' (ప్రెషర్ కుక్కర్‌ది)ని కూడా వాడుకోవచ్చు మెడ భాగానికి.

దాదాపు ఒక అరగజం - తెలుపు రంగులో పల్చని బట్ట కావాలి - ఆర్గండీ గానీ, దోమతెర లాంటి బట్టమీద పువ్వుల డిజైను ఉన్నదిగానీ, తెలుపుమీద తెలుపు పువ్వుల డిజైను ఉన్న వాయిల్‌గానీ బావుంటుంది –ఈ రకం బొమ్మకి. ముఖానికీ, చేతివేళ్ల భాగానికీ లేత గులాబీ రంగుది (ముఖానికి బావుండే రంగు) 'ఫాల్'- బట్ట వంటిది కావాలి. జుట్టుకి ముదురు 'బ్రౌన్‌కలర్' బట్టకావాలి. సాక్స్ వంటిది మరీ బావుంటుంది మెత్తగా.

'డ్రెస్' లోపల డబ్బా చుట్టూ కుట్టడానికి ఏదైనా తెలుపురంగు బట్ట వాడాలి. ఇందులోంచి 3 అంగుళాల పొడుగూ, 3 అంగుళాల వెడల్పూ ఉన్న ముక్కని గుండ్రంగా కత్తిరించుకుని, దాని అంచుమీద చుట్టూ ఫెవికోల్‌ని సన్నగా గీతలాగ పూసి, బట్టమధ్య డబ్బాపెట్టి ఆ అంచుల్ని డబ్బా చుట్టూ అతికించాలి.

తరవాత, డబ్బా చుట్టు కొలతకి సరిపడేటట్లూ, డబ్బా మూత మీదికి వచ్చేటట్లూ తెలుపురంగు బట్ట ముక్కని కత్తిరించుకుని, దాని నిలువులో కిందివైపు కొద్దిగా లోపలికి మడిచి, ఆ మడతని డబ్బా కిందివైపు అంచుమీద పెట్టి, చుట్టూ టాకాలు వేస్తూ, అడుగునున్న బట్టకి అతకాలి. చుట్టూ అతికిన తరవాత, డబ్బా వెనకవైపు రెండు అంచుల్నీ నిలువునా అతకాలి.

డబ్బా మూత దగ్గర ఉన్న అంచుని కొద్దిగా లోపలికి మడిచి, చుట్టూ కూర్పుతీసి, మూత చుట్టూ బిగించి కుట్టాలి. తరవాత, వాషర్‌ని (ఒకటో రెండో, అవసరాన్ని బట్టి) డబ్బామూత మీద పెట్టి, దానిమీద చిన్న బట్టముక్కని (తెలుపుది) కప్పి, మూత చుట్టూ బట్ట అంచుల్ని అతకాలి. అపుడు మళ్లీ దానిపైన 21/2 అంగుళాల పొడుగూ, 21/2 అంగుళాల వెడల్పూ ఉండే గుండ్రని లేత గులాబీరంగు బట్ట ముక్కని మూత కిందవరకూ వచ్చేటట్లు కప్పి, అంచుల్ని చుట్టూ అతకాలి. ముడతలు రాకుండా చూడాలి.

మూత కిందిభాగం మీద "ఛెస్ట్" ఎత్తుగా ఉండేటట్లు దూదితో రెండు ఉండలు చేసిపెట్టి, వాటి మీది చిన్న బట్టముక్కని (తెలుపుది) కదిలిపోకుండా కప్పి, నాలుగువైపులా డబ్బామీది బట్టకి అతకాలి. తరవాత, 8 అంగుళాల పొడుగూ, 2 అంగుళాల వెడల్పూ ఉండేటంత బట్టని (ఆర్గండీ వంటి డ్రెస్ మెటీరియల్) - ఛాతీపై నుంచి నడుము వరకూ సరిపోయేటట్లు చూసుకుని - కత్తిరించుకోవాలి. మళ్ళీ ఆ ముక్కని - పొడుగులో - పైన 8 అంగుళాలూ, కింద 5 అంగుళాలూ ఉండేటట్లు ఏటవాలుగా రెండువైపులా కత్తిరించాలి. కింద అంచుని నడుము చుట్టు అతికి, తరవాత, పై అంచుమీద కొంచెం కిందుగా కూర్పు తీసి ఛాతీపైకి - దూది ఉండల్ని కప్పేటట్లు పెట్టి, కుచ్చెళ్లని లేసులాగ చుట్టూ సరిదిద్ది, వెనకవైపు అంచుల్ని నిలువునా

అతకాలి. ఛాతీకి పైనా, కిందా, చుట్టూరా టాకాలు వెయ్యాలి కుట్లు కనిపించకుండా.

తరవాత, 12 అంగుళాల పొడుగూ, 5 అంగుళాల వెడల్పూ ఉండేటంత బట్టని కత్తిరించుకుని, దాని పైవైపు పొడుగునా కుచ్చెళ్లు పెట్టి కుట్టి 5 అంగుళాలు వచ్చేటట్లు చెయ్యాలి. ఆ కుచ్చెళ్లని బొమ్మ నడుము చుట్టూ పెట్టి అతకాలి- – అతుకు బొమ్మ వెనకవైపుకి వచ్చేలాగ వెనకాల అంచుల్ని నిలువునా అతకాలి. గౌనుబట్ట పల్చగా ఉంటుంది కాబట్టి లోపల తెల్లటి దళసరి బట్టని 'లైనింగ్'గా వెయ్యాలి.

అరంగుళం వెడల్పులో ఒక మీటర్ పొడుగున 'డ్రెస్ మెటీరియల్'ని పీలికలా కత్తిరించుకుని, పొడుగునా రెండు వైపులా ఆర్చిల్లా కత్తిరించి, మధ్యనుంచి పీలికని కూర్పు తీయాలి. కుచ్చెళ్లలా వచ్చిన దాన్ని గౌను కిందివైపు అంచు చుట్టూ పెట్టి కుట్టాలి. అలాగే, మరో పీలికని కత్తిరించి కుచ్చెళ్లు పెట్టి, గౌను అంచుకి అంగుళంపైన మళ్లీ చుట్టూ పెట్టి కుట్టాలి. మిగిలిన బట్టని చేతులకి పువ్వుల కోసమూ, తలపై నుంచి వేళ్లాడే మేలి ముసుగు కోసమూ వాడాలి.

8 పువ్వులు ఒక చేతికి, 8 పువ్వులు మరొక చేతికీ కావాలి, వాటిలో చెరొక రెండు పువ్వుల్ని పెద్దవిగానూ, (31/2" x 31/2"), తక్కినవి చిన్నవిగానూ (3" x 3") గుండ్రని బట్టముక్కల్ని కత్తిరించి పువ్వులుగా కుట్టాలి - (అంచుచుట్టూ కూర్పు తీసి, దగ్గరగా లాగి బిగించి ముడివేసి, కుచ్చెళ్లు సర్ది కొద్దిగా అణచాలి) రెండు లేత గులాబీ రంగు బట్ట ముక్కల్ని (ముఖం రంగుని) 2" x 11/2" సైజులో కత్తిరించి, చిన్నపువ్వులుగా కోలగా వచ్చేటట్లు కుట్టాలి - రెండు చేతులకీ చెరొకటీ. ఒక లేత గులాబీరంగు పువ్వుని తీసుకుని బొడ్డు వైపు (కుచ్చెళ్లు వచ్చినచోట) మధ్యకి మడిచి, అందులోంచి సూదీ దారాన్ని గుచ్చాలి. ఊడిపోకుండా రెండు టాకాలు వేసిన తరవాత, తెలుపురంగులో 8 పువ్వుల్ని ఒకదానిమీద ఒకటి - ముందు చిన్నవి 6, తరవాత పెద్దవి రెండూ - కుట్టులేనివైపునుంచి బొడ్డువైపుకి దగ్గరగా గుచ్చాలి. దాన్ని ఒక భుజానికి గట్టిగా అతకాలి - సూదీ దారాన్ని ఒకసారి భుజంమీది (డబ్బా పక్కవైపు) బట్టలోంచీ, మరోసారి పువ్వు బొడ్డు కుచ్చెళ్లలోంచీ పోనిస్తూ బొడ్డు చుట్టూ భుజానికి అతకాలి. అలాగే రెండవ దండని గుచ్చి రెండవభుజానికి అతకాలి.

ఇప్పుడు తలకాయని తయారు చెయ్యాలి. లేత గులాబీ రంగు బట్ట ముక్కని 5 అంగుళాల పొడుగూ, 3 అంగుళాల వెడల్పూ ఉండేటట్లు కత్తిరించుకుని, దాని నిలువు మధ్యలో 'బాల్'ని పెట్టి, నిలువువైపు అంచులు రెండింటినీ కలిపి అతకాలి. తరవాత, పక్కల నున్న బట్టని వెనకవైపుకి మడిచి, వెనక నున్న బట్టమీద అతకాలి. ముందువైపు ముడతలు రాకుండా చూసుకుని, ముడతల్ని వెనక్కిలాగి కుట్టాలి.

ముదురు 'బ్రౌన్‌కలర్'లో పల్చని బట్ట ముక్కని 10 అంగుళాల పొడుగూ, 6 అంగుళాల వెడల్పూ ఉండేటట్లు కత్తిరించుకోవాలి. పొడుగులో ఒకవైపు అంగుళంమేరపైకి మడతపెట్టి, ఆ మడత అంచుమీద (పోగులున్న వైపు) కూర్పుతీసి కొంచెం దగ్గరగా లాగాలి. కుచ్చెళ్లలా వస్తాయి. తలమీద ఈ చెంప కింది నుంచి ఆ చెంప కిందివరకూ వచ్చేటట్లు పెట్టి, కుచ్చెళ్లు, నుదుటిపైన కొంచెం ఎక్కువగా వచ్చేటట్లు సర్ది, చుట్టూ టాకాలు వెయ్యాలి. తరవాత, వెనకవైపు బట్టని మెడకింది వరకూ వచ్చేటట్లు, పెట్టి టాకాలువేసి, మిగిలిన బట్టని పైకి మడిచి, అవసరమైన చోట్ల టాకాలు వెయ్యాలి. 'బాబ్డ్ హెయిర్'లా కనిపించేటట్లు సర్ది కుట్టాలి. అవసరమైతే చిన్న చిన్న ముక్కలు వేరే కత్తిరించి ముంగురులు లాగ పెట్టొచ్చు.

ఇప్పుడు తలకాయని బొమ్మ మెడ భాగం మీదపెట్టి అతకాలి - సూదీ దారాన్ని తలకింది భాగంలోంచి ఒకసారీ, మెడమీది బట్టలోంచి ఒకసారీ పోనిస్తూ, మెడ చుట్టూ రెండుసార్లు కుట్టాలి - మెల్లగా లాగుతూ బిగించి కుట్టాలి తల ఇటూ అటూ కదలకుండా.

దోమతెరలాంటి బట్టముక్కనే 9 అంగుళాల పొడుగూ, 5 అంగుళాల వెడల్పూ ఉండేటట్లు కత్తిరించుకుని, పొడుగువైపు మధ్యన ఒక అంచుని నాలుగైదు చిన్న కుచ్చెళ్లు వచ్చేటట్లు కుట్టి, ఆ కుచ్చెళ్లను బొమ్మతల నెత్తిమీద మధ్యన పెట్టి జుట్టుకి అతకాలి - కుచ్చెళ్లకొనలు వదిలిపెట్టి కొంచెం వెనకగా కుట్టాలి. కుచ్చెళ్లని కొంచెంపైకి ఎత్తినట్లు పెట్టి టాకాలు వెయ్యాలి.

చెవులకు వేళ్లాడుతున్నట్లుగా, రెండు ముత్యాల్లాగ కనిపించే పూసల్ని తెల్లని చంకీ బిళ్లల మీద పెట్టి కుట్టాలి. మెడచుట్టూ కుట్లు కనిపించకుండా ఒక సన్నని తెల్లని చంకీ రిబ్బన్ పెట్టి కుట్టి, దానికి మధ్య, తెల్లని చంకీబిళ్లమీద తెల్లని పూసనిపెట్టి పతకంలా కనిపించేటట్లు కుట్టాలి.

ఆకుపచ్చని కాడల్తో ఉన్న తెలుపు, గులాబీ పువ్వుల గుత్తిని పట్టుకున్నట్లుగా బట్టముక్కల్ని కత్తిరించి, 'చేతుల' చివరనున్న గులాబీ రంగు పువ్వుల మధ్యపెట్టి, రెండింటినీ కలిపి కుట్టాలి.

ఆఖరున, బొమ్మ ముఖంమీద ముందుగా పెన్సిల్‌తో కళ్లూ ముక్కూ, నోరూ గీసుకుని, తరవాత ఫాబ్రిక్ పెయింట్స్‌తో సన్నని బ్రష్‌తో పెయింట్ చేసుకోవాలి. కనుబొమలూ, కళ్లూ ముదురు 'బ్రౌన్ కలర్'లో వేసి, కనుగుడ్లు ముదురు నీలం, ఆకుపచ్చ రంగులతో వెయ్యొచ్చు. ముక్కు స్థానంలో అట్ట ముక్కతో చేసిన ముక్కుని పెట్టాలి. త్రికోణాకారంలో చాలా చిన్న ముక్కని కత్తిరించి, దానికన్న కొంచెం పెద్దదిగా గులాబీరంగు బట్టముక్కని కత్తిరించి అట్టముక్కని మధ్యన పెట్టి ఫెవికోల్‌తో అంచులు లోపలికి అతికించాలి. మళ్లీ కొంచెం ఫెవికోల్ పూసి ముక్కు ఉండవలసిన చోట అతికించాలి! అంతే!






# 10. మాట్లాడే చిలక బొమ్మ

"మాట్లాడే చిలక"ని బట్టతో చేసి పిల్లలకి ఆడుకునేందుకు ఇవ్వొచ్చు. చేత్తో చిలకని పట్టుకుని, దాని నోరు కదుల్తున్నట్లు ఆడిస్తూ, పట్టుకున్న వాళ్ళే నోరు తెరవకుండా చిలకపలుకుల్ని పలకాలి! అదే "వెంట్రిలోక్విజమ్"! ఇటువంటి చిలకని "ఫాల్" బట్టతో సులభంగా చెయ్యొచ్చు. దీనికి చిలకాకుపచ్చ రంగుది "ఫాల్" (చిన్నసైజుది) కావాలి. (ఇంట్లో వేరే ఏదైనా బట్ట అదే రంగుది ఉంటే దాన్ని వాడొచ్చు). "ఫాల్" బట్ట కింద "లైనింగ్" వెయ్యడానికి ఏదైనా మెత్తని పాతబట్ట ఉండాలి-- తెలుపుది గాని, లేత రంగుది గాని. ముక్కుకీ, నోరుకీ ఎరుపు రంగుది దళసరి బట్టముక్క (కేస్‌మెంట్ వంటిది) ఉండాలి. నోటి లోపలికి వాడేందుకు గులాబీ రంగు ముక్క ఉండాలి.

"ఫాల్" బట్టని రెండు పొరలు వేసి, మళ్లీ మధ్యకి మడిచి, బొమ్మలో చూపించినట్లుగా చిలక ఆకారంలో తల నుంచి పొట్ట కింది వరకూ కత్తిరించుకోవాలి- "ఫాల్" వెడల్పు అలాగే ఉంచి, 91/2 అంగుళాల పొడుగు ఉండేటట్లు కత్తిరించాలి. చిలక వీపు వైపు-తల కింది నుంచి "ఫాల్" అంచులు (కుట్టినవి) కత్తిరించకుండా అలాగే ఉంచెయ్యాలి.

లోపలి "లైనింగ్" బట్టని కూడా అదే ఆకారంలో కత్తిరించుకోవాలి. పల్చని బట్ట అయితే రెండేసి పొరలు వేసుకోవాలి "ఫాల్" లాగే. ఇప్పుడు, కింద రెండు పొరలు లైనింగ్ బట్ట వాటిపైన రెండు పొరలు చిలకాకుపచ్చ బట్ట ముక్కలు, వాటిపైన వాటిపైన రెండు పొరలు చిలకాకుపచ్చ బట్ట ముక్కలూ, మళ్ళీ రెండు పొరలు లైనింగ్ బట్ట పెట్టి, అన్నింటినీ కలిపి అంచుమీద






గట్టి కుట్టుతో అతకాలి. ముందుగా ముక్కు మొదలయేచోట మొదలుపెట్టి, తలలో గుండ్రని భాగం అంతమేరా కుట్టాలి. మధ్యలో 41/2 అంగుళాల మేర వదిలేసి, అక్కణ్ణించి వీపు కింది వరకూ కుట్టాలి. తరవాత, నోటి కింద నుంచి మొదలు పెట్టి మెడ కింది వరకూ అతకాలి. వీపు మీద వదిలిన ఖాళీ జాగాలో మన చెయ్యి దూర్చేందుకు సరిపోయేటట్లు చూసుకోవాలి. కుట్టిన బట్టని మంచి వైపుకి తిరగెయ్యాలి.

ముక్కులాగ కత్తిరించిన ఎరుపు రంగు బట్ట ముక్కని తిరగేసి పట్టుకుని, పై అంచు మధ్య భాగాన్ని (మడత పెట్టిన చోటు) చిలక ముఖం మీద ముక్కు మొదలయేచోట (పైన) పెట్టి, రెండింటినీ కలిపి అతకాలి. (జాకట్టు భుజానికి చేతిని అతికినట్లు). తరవాత, ముక్కుని తిరగేసి, వంపుగా ఉన్న పైభాగాన్ని (కత్తిరించి ఉన్న భాగాన్ని) అతకాలి.

ఇప్పుడు, 'నోరు' లాగ కత్తిరించిన ఎరుపు ముక్కని తీసుకుని తిరగేసి పట్టుకుని, దానిపై అంచు మధ్య భాగాన్ని (మడిచిన చోటు) ముఖం మీద నోటి కింద-- మధ్యన అతకాలి. తరవాత రెండు వైపులా అతకాలి-ముక్కుని అతికినట్లుగానే. దీన్ని కూడా తిరగేసి, కత్తిరించి ఉన్న భాగాన్ని అతకాలి.

ఇలా కుట్టాక ముక్కూ, నోరూ డొప్పల్లాగ తెరుచుకున్నట్లు ఉంటాయి. ముక్కు కొనలూ, నోటి కొనలూ కలుసుకుని-రెండు వైపులా ఒక దానిమీదికి ఒకటి వచ్చేటట్లు ఉండాలి ఖాళీ లేకుండా. ఇప్పుడు మొత్తం తలని మళ్లీ తిరగెయ్యాలి. నోటిలోపల పెట్టవలసిన రెండు గులాబీరంగు బట్ట ముక్కల్నీ తీసుకోవాలి. అందులో పెద్ద దాన్ని కోసుగా ఉన్న వైపుని ముక్కుపై భాగంలో కొనమీద పెట్టి, రెండూ కలిపి అతికి, తరవాత రెండు వైపులా అతకాలి. అలాగే రెండవ గులాబీ రంగు ముక్క కొనని నోటి కొనమీద పెట్టి అతికి, రెండువైపులా అతకాలి. తరవాత, నోటి లోపలి రెండు గులాబీ రంగు ముక్కల అంచుల్నీ కలిపి అడ్డంగా అతకాలి.

ముక్కుకీ, నోటి లోపలా వేసిన అతుకులన్నిటినీ మరోసారి అతికితే, వేళ్లు పెట్టి ఎన్నిసార్లు ఆడించినా కుట్లు ఊడిపోకుండా ఉంటాయి. ఇప్పుడు మళ్లీ తలని మరోసారి మొత్తం తిరగేస్తే ముక్కుతో సహా చిలక ఆకారం కనిపిస్తుంది. చిలక వీపుమీద కుట్టకుండా వదిలేసిన పొరల్ని రెండువైపులా విడివిడిగా లైనింగ్‌తో కలిపి అతుక్కోవాలి. చిలక పై భాగం మీద కుట్లు ఎక్కువగా కనిపించకుండా గట్టికుట్లు కుట్టాలి.

కిందనున్న రెండు వైపులా అంచుల్నీ కొద్దిగా లోపలికి మడిచి టాకాలు వెయ్యాలి. ఆ రెండు అంచుల్నీ దగ్గరగా లాగి, మధ్య తోకని పెట్టి అతకాలి. తోక కోసం 51/2 అంగుళాల పొడుగులో రెండు పొరల "ఫాల్" ముక్కని తీసుకుని, రెండింటినీ కలిపి, మడిచిన వైపు మూడు కుచ్చెళ్ళు పెట్టి టాకా వెయ్యాలి. ఆ కుచ్చెళ్ళని చిలక కింద అంచుల మధ్య ఒక అరంగుళం మేర లోపలికి పెట్టి, అంచుల్నీ కుచ్చెళ్ళన్నీ కలిపి అతకాలి. తోక కొసల్ని చిన్న చిన్న వంపులుగా కత్తిరించాలి. తోక చివర కూడా వదులుగా కుచ్చెళ్లు పెట్టి మధ్యలో ఒక చిన్న టాకా వెయ్యాలి.

ఇప్పుడు 6 అంగుళాల పొడుగులో రెండు పొరల "ఫాల్" ముక్కని తీసుకుని, మడత ఉన్నవైపు మూడు కుచ్చెళ్ళు పెట్టి, చిలక వీపు మీద చీలిక మొదలైన చోట (పైన) కొద్దిగా లోపలికి కుచ్చెళ్లని తోసి, గట్టిగా అతకాలి. రెండవ వైపు కొసల్ని చిన్నచిన్న వంపులుగా కత్తిరించి వదిలెయ్యాలి. చేతిని దూర్చి ఆడించేటప్పుడు ఆ వీపుమీది బట్టని మన చేతిపైకి కప్పుకోవాలి. ఉత్తప్పుడు కొసల్ని కొద్దిగా లోపలికి దోపి ఉంచాలి.

ఆఖరున, చిలకకి గుండ్రంగా కళ్లు-రెండు వైపులా చెరొకటీ - ఫాబ్రిక్ పెయింట్స్‌తో పెయింట్ చెయ్యాలి. ఎంబ్రాయిడరీ చేసినా చెయ్యొచ్చు. చిలకని ఆడించడానికి, చిలక వీపులోంచి, చెయ్యిదూర్చి, బొటన వేలుని నోరు లోకీ, చూపుడు వేలునీ మధ్య వేలునీ ముక్కులోకీ దూర్చి, వేళ్లని పైకీ కిందికీ కదిలిస్తే చిలక మాట్లాడుతున్నట్లు కదలిక కనిపిస్తుంది. మనం పైనుంచి పళ్లు గిట్టకరిచి చిలకలా మాట్లాడితే చిలక మాట్లాడుతున్నట్లు అనిపిస్తుంది. పిల్లలు దీన్ని చూసి ముచ్చట పడతారు.

# 11. వెలక్కాయలతో వినాయకుడు

వెలక్కాయలు ఏనుగులకు చాలా ఇష్టం కదా. వెలక్కాయల్తో వినాయకుడి బొమ్మ చేస్తే ఎంత సందర్భోచితంగా ఉంటుంది! కష్టమేమీకాదు. జోకర్ బొమ్మని చేసినట్లే దీన్ని కూడా సులభంగా చెయ్యొచ్చు. దీన్ని ముస్తాబు చేశాక నీళ్లలో పారేయబుద్ధి పుట్టదు! పిల్లలు ఆడుకునేందుకూ పనికొస్తుంది.

కావలసిన వస్తువులు - రెండు వెలక్కాయ డొల్లలూ, ఒక ఖాళీ కొబ్బరి చిప్ప, అట్టముక్కలూ, బట్టముక్కలూ, చంకీ లేసులు, లేత రంగులో (లేత కనకాంబరం, లేత గులాబీ, లేతనీలం-ఏదైనా) ఒక 'ఫాల్' (చీరలకు కుట్టేది) తీసుకోవాలి. బొమ్మచెయ్యగా అందులో ఒక గజం దాకా మిగిలిపోతుంది. దాన్ని వేరే బొమ్మలకు వాడుకోవచ్చు. లేదా, ఫాల్ బదులు వేరే మెత్తని బట్ట ఏదైనా వాడుకోవచ్చు. ముదురు రంగులో 20 సెంటీమీటర్ల పొడుగూ, 20 సెం.మీ. వెడల్పూ ఉన్న దళసరి బట్ట (పాప్లిన్, ఖద్దరు వంటిది) కావాలి. ఒక అరమీటరు చొప్పున రెండు - ఒకటి వెడల్పుదీ, ఒకటి సన్ననిదీ చంకీ లేసులు కావాలి. చెవులకీ, తొండానికీ సరిపడే అట్టముక్కలు కావాలి. 

**చేసే పద్ధతి :**



రెండు వెలక్కాయలు తీసుకోవాలి- ఒకటి పెద్దది, ఒకటి కొంచెం చిన్నదీ. వాటిని మధ్యకి పగలకొట్టకుండా ముచిక దగ్గర సుత్తితో మెల్లగా రూపాయంత మేర కొట్టి, పెచ్చులుతీసి, ఒక చెమ్చాతో లోపలి గుజ్జునంతా బయటికి తీసెయ్యాలి. (గుజ్జుని పచ్చడి చేసుకోవచ్చు).

ఇప్పుడు వెలక్కాయ డొల్లలు మిగులుతాయి వాటి లోపల బాగా ఎండిపోయాక బొమ్మచేయడం మొదలు పెట్టాలి.

రెండింటిలో చిన్న వెలక్కాయని తీసుకుని దాని చుట్టూ లేతరంగు ఫాల్ బట్టముక్కని (వెలక్కాయ చుట్టుకొలత ప్రకారం ఫాల్ ముక్కని తీసుకోవాలి) చుట్టి, అంచుల్ని కొద్దిగా లోపలికి మడిచి ఒకదానికి ఒకటి అన్చి, పోగులు కనిపించకుండా నిలువునా అతకాలి.

వెలక్కాయకి పైనున్న బట్ట అంచుని దగ్గరికి కలుపుకుంటూ లాగి కుట్టాలి-వినాయకుడి నడినెత్తి మీదికి వస్తుంది కుట్టు. తరువాత, కిందనున్న అంచుని దగ్గరికి లాగుతూ ముచిక దగ్గరికి వచ్చేటట్లు కుట్టాలి. ఈ కుట్టడంలో వెలక్కాయ ముందువైపూ, వెనుకవైపూ ముడతలు ఎక్కడా రాకుండా చూసుకోవాలి. ఎక్కువగా ఉన్న బట్ట ముడతల్ని వెలక్కాయకి ఇటూ అటూ చెవుల వైపుకి జరుపుకుంటూ లైనులా కుట్టాలి. మెడ దగ్గర (ముచిక దగ్గర) ముందు వైపూ వెనకవైపూ ముడతలు రాకుండా చూసుకోవాలి.

ఇప్పుడు రెండు అట్టముక్కల్ని (ఫాల్ లోపల ఉండే అట్ట) చెవి ఆకారంలో (బొమ్మలో ఇచ్చినట్లుగా) వెలక్కాయకి సరిపడేటట్లు కత్తిరించుకోవాలి. లేతరంగు ఫాల్ బట్టని తీసుకుని చెవి ఆకారంలో అట్ట చెవికన్న కొంచెం పెద్దగా నాలుగు ముక్కలు కత్తిరించుకోవాలి. రెండు బట్టముక్కల్ని ఒకదానిమీద ఒకటి పెట్టి మూడు పక్కలా గట్టి కుట్టుతో అతుక్కోవాలి- ఒకవైపు (నిలువుగీత వైపు) కుట్టకుండా వదిలెయ్యాలి. అలాగే మిగిలిన రెండు ముక్కల్నీ కలిపి కుట్టుకోవాలి. కుట్టాక, వాటిని తిరగేసి, వాటిలో చెవుల కోసం కత్తిరించుకున్న అట్టముక్కల్ని దూర్చాలి. అట్టముక్కల్ని లోపలికి దూర్చాక, బట్ట అంచుల్ని లోపలికి కొద్దిగా మడుచుకుంటూ, పైనుంచి కింది వరకూ కుట్టుతో అతుక్కోవాలి. తరవాత, రెండు చెవుల్నీ వెలక్కాయకి

చెరోవైపునా అతుక్కోవాలి-వెలక్కాయ మీది బట్టలోంచి ఒకసారి, చెవిమీది బట్టలోంచి ఒక సారి, సూదిని దూరుస్తూ పైనుంచి కిందివరకూ అతుక్కోవాలి గట్టిగా.

తొండం, కిరీటం చేసేముందు పొట్ట సంగతి చూద్దాం. రెండవ వెలక్కాయని తీసుకుని, లేతరంగు ఫాల్‌బట్ట ముక్కని వెలక్కాయ చుట్టూ పెట్టి, మొదటి వెలక్కాయకి కుట్టినట్లుగానే కుట్టాలి. వెనకాల అతుకు వేసి, పై అంచునీ, అలాగే కింద అంచునీ దగ్గరకి లాగి కుట్టాలి. ముందు వైపూ వెనకవైపూ ముడతలు రాకుండా, ఎక్కువగా ఉన్న బట్ట మడతల్ని వెలక్కాయ పక్కలికి-భుజాల వైపుకి పెట్టి కుట్టాలి.

ఇప్పుడు కొబ్బరి చిప్పని తీసుకుని, గుండ్రంగా కత్తిరించుకున్న దళసరి అట్టముక్కమీద బోర్లించి పెట్టాలి. లోపల రెండు ప్లాస్టిక్ మూతలు (టూత్ పేస్ట్ మూతలు లాంటివి) వెయ్యాలి గల గల లాడటానికి.

ముదురు రంగు బట్టముక్కని గుండ్రంగా కత్తిరించుకుని దాని చుట్టూ అంచుమీద కూర్పు తీసి, బట్ట మధ్యలో అట్టముక్కనీ, దానిమీద బోర్లించిన కొబ్బరి చిప్పనీపెట్టి, బట్టకుచ్చెళ్ళు దగ్గరికి లాగి, కొబ్బరి చిప్ప పైన-మధ్యలో ముడి వెయ్యాలి. కుచ్చెళ్ళు కొబ్బరి చిప్పచుట్టూ బిగువుగా ఉండేటట్లు కుట్టాలి.

ఇప్పుడు దానిమీద పెద్ద వెలక్కాయని (పొట్ట) ముచిక భాగం- కిందికి - కొబ్బరి చిప్పమీదికి వచ్చేటట్లు పెట్టాలి. మధ్యలో కొంచెం ఫెవికోల్ పూసి, వెలక్కాయ ఆనినంత భాగం చుట్టూ కొబ్బరి చిప్ప మీది బట్టనీ వెలక్కాయమీది బట్టనీ కలిపి కుట్టాలి-సూదీ దారాన్నీ ఒకసారి కొబ్బరిచిప్ప మీది బట్టలోంచీ, మరోసారి వెలక్కాయ ముచిక చుట్టూ ఉన్న బట్టలోంచీ దూరుస్తూ, రెండు మూడు చుట్లు గట్టిగా కదలకుండా ఉండేటట్లు కుట్టాలి.

ఇప్పుడు వినాయకుడి తలని మెడకి అతికించాలి. అంటే, మొదటి వెలక్కాయని రెండో వెలక్కాయ మీద పెట్టి అతకాలి. మొదటి వెలక్కాయ ముచిక భాగం రెండో వెలక్కాయ పైభాగం మీద పెట్టి, మధ్యలో కొంచెం ఫెవికోల్ పూసి, చుట్టూ అతుక్కోవాలి-కింది వెలక్కాయ మీది బట్టలోంచి ఒకసారి, పై వెలక్కాయ మీది బట్టలోంచి ఒకసారి, సూదీ దారం దూరుస్తూ గట్టిగా రెండు చుట్లు కుట్టుకోవాలి.

తొండం చెయ్యడానికి ఒక దళసరి అట్టముక్కని తీసుకుని (పేకింగ్‌కి ఉపయోగించే దళసరి అట్ట డోర్యాలుండి కొంచెం మెత్తగా ఉన్నదయితే బావుంటుంది) తొండం ఆకారంలో (బొమ్మలో చూపించినట్లు) కత్తిరించుకోవాలి - కుడివైపునకుగాని, ఎడమవైపునకుగాని. లేకపోతే, ఒక మామూలు అట్టని తొండం ఆకారంలో కత్తిరించుకుని, దాని సైజులోనే దూదిపొరని (సర్జికల్ కాటన్ బండిల్ లోనిది) కత్తిరించుకోవాలి.

అట్టముక్క కన్న కొంచెం పెద్దసైజులో (చుట్టూ ఒక సెంటీమీటరు ఎక్కువ ఉంటే సరిపోతుంది) లేతరంగు ఫాల్ ముక్కని కత్తిరించుకోవాలి. ఆ బట్టముక్క మీద దూదిపొరనీ, దానిమీద అట్టముక్కనీ పెట్టి (తొండం కుడివైపుకి రావాలంటే ముక్కలు అన్నిటినీ ఎడమవైపుకి పెట్టి కుట్టాలి), బట్ట అంచుల్ని కలుపుకుంటూ కుట్టుతో గాని, ఫెవికోల్‌తోగాని తొండం పొడవునా అతకాలి. ముందువైపు ముడతలు రాకుండా చూసుకోవాలి. తొండం 'వంపు' తిరిగిన చోట బట్ట అంచుని కొద్దిగా కత్తిరిస్తే అక్కడ ముడతలు రావు.

తొండం పైభాగాన్ని వినాయకుడి ముఖం మీద మధ్యన పెట్టి, ఆ భాగం చుట్టూ అన్ని వైపులా అతుక్కోవాలి. ఫెవికోల్ వాడుకోవచ్చుగాని, ఊడిపోకుండా జాగ్రత్తపడాలి.

ఇప్పుడు కిరీటాన్ని చేసుకోవాలి. రెండు అట్టముక్కల్ని (ఫాల్ లోపల పెట్టే అట్టను వాడుకోవచ్చు) కిరీటం ఆకారంలో

(బొమ్మలో చూపినట్లుగా) కత్తిరించుకోవాలి. వాటికన్నా కొంచెం పెద్దగా ముదురు రంగు బట్టని అదే ఆకారంలో రెండు కత్తిరించుకోవాలి. రెండు బట్టముక్కల్నీ, కింది భాగం వదిలి, మిగిలిన రెండు పక్కలా గట్టికుట్టుతో 'అంచుల్ని' అతకాలి. అప్పుడు దాన్ని తిరగేసి, అందులో అట్టముక్కల్ని దూర్చి కొద్దిగా ఫెవికోల్ పూసి అతికించాలి.

ఆ కిరీటం మీద చంకీలేసు కుట్టాలి. కిరీటాన్ని వెలక్కాయ (వినాయకుడి తల) మీద పెట్టి (చెవుల మధ్యకీ, నుదుటి మీదికి కొద్దిగా వచ్చేటట్లు కుట్టాలి) తల చుట్టూ కిరీటం కదిలిపోకుండా. గట్టిగా అంచుచుట్టూ అతికించాలి.

చంకీ రిబ్బను తీసుకుని, బొమ్మమెడ వెనక నుంచి ముందు భుజాల మీదుగా కిందివరకూ వేలాడేటట్లు పెట్టి అక్కడక్కడ టాకాలు వెయ్యాలి కదిలిపోకుండా. కుట్లు కనిపించకుండా ఉండాలి. మరొక సన్నని చంకీ లేసు తీసుకుని పొట్టకింద ధోవతి మొదలయ్యేచోట వెలక్కాయకీ కొబ్బరి చిప్పకీ మధ్యన చుట్టూ అతికించాలి. చెవులమీద కూడా చెంపల పొడుగునా అతికించాలి. మెడలో జంధ్యంలాగ ఒక తెల్లని చంకీరిబ్బనుగాని, తెల్లదారంగాని అతికించాలి.

ఈ బొమ్మకి చేతులు లేకపోయినా నిండుగా ఉంటుంది. చేతులవీ పెట్టాలంటే ఇంకా కష్టపడాలి. ఇది వెలక్కాయల్తో తేలిగ్గా ఉండే బొమ్మ. తొండం చివరకూడా ఒక సెంటీమీటర్ పైన-చిన్న చంకీలేసు కుట్టాలి. తొండానికి ఇటూ అటూ దంతాలు పెట్టాలి. దంతాల సైజులో అట్టముక్కలు గట్టివి కత్తిరించుకుని, వాటి చుట్టూ తెల్లని బట్ట ముక్క అంటించి, వాటిని తొండానికి చెరోవైపునా అతికించాలి (దంతాల్లో ఒకటి చిన్నముక్క, ఒకటి పూర్తిగా ఉంటుంది).

ఆఖరున, వినాయకుడి ముఖం మీద కళ్ళూ, బొట్టూ ఫాబ్రిక్ పెయింట్స్‌తో గాని, పోస్టర్ కలర్స్‌తోగాని దిద్దాలి. పిల్లలకివ్వడానికయితే తడి తగిలినా పోడవని ఫాబ్రిక్ పెయింట్స్ వాడటం మంచిది.

అంతేమరి, బొమ్మ తయారైపోయినట్లే!






# 12. బట్ట ముక్కలతో వినాయకుడు

ఈ రకం వినాయకుడి బొమ్మని చెయ్యడానికి బట్టని పువ్వు రేకుల్లా కత్తిరించుకుని, ఫెవికోల్‌తో మరో బట్టమీదగాని, కార్డుమీదగాని, అతికించుకోవాలి. పెద్దవాళ్లూ, కొంచెం ఎదిగిన పిల్లలూ కూడా సులభంగా చెయ్యగలిగేది-ఈ రకం బొమ్మ.

దీనికి ఖద్దరు, కేస్‌మెంట్, పాప్లిన్‌వంటి దళసరి బట్ట బావుంటుంది. మూడు రంగుల్లో బట్టముక్కలు కావాలి. ఒకటి వెనకాల ఉండేది-బొమ్మని అతికించడానికి. దానికి ముదురు ఆకుపచ్చ ఉంటే బావుంటుంది. బొమ్మకి రెండు రంగుల బట్టముక్కలు కావాలి ఒకటి లేత రంగులోనూ. మరొకటి ముదురు రంగులోనూ (లేత గులాబీ, కనకాంబరం, లేదా, లేత నీలం, ఎరుపు-ఇలా ఏవైనా). లేత రంగుబట్ట శరీరానికీ, ముదురు రంగుబట్ట వినాయకుడి ధోవతికీ, కిరీటానికీ ఉపయోగించవచ్చు. రెండు రంగుల్లో చెరొకటీ జానెడు పొడుగూ, జానెడు వెడల్పూ ఉన్న బట్టముక్కలు రెండు సరిపోతాయి. బొమ్మ చెయ్యగా ఏమైనా మిగిలితే మరొక రకం బొమ్మకి ఉపయోగించుకోవచ్చు.

చిన్న బొమ్మ చెయ్యాలనుకుంటే చిన్నచిన్న ముక్కలు చాలు. వీటిని గ్రీటింగ్ కార్డుమీద అతికించుకోవచ్చు.

బట్టమీద అతికించడానికి-ఆ బట్టముక్క 24 సెంటీమీటర్ల పొడుగూ, 21 సెంటీమీటర్ల వెడల్పూ ఉండాలి. (ముదురు ఆకుపచ్చ బదులు మరేదైనా బావుంటుందనిపిస్తే, ఆరంగుది వాడుకోవచ్చు.)

బొమ్మ కోసం తీసుకున్న రెండు రంగుల బట్ట ముక్కల్నీ రకరకాల సైజుల్లో (బొమ్మలో ఇచ్చినట్టుగా) పువ్వురేకుల్లా కత్తిరించుకోవాలి. రేకుల్ని కొన్నిటిని గుండ్రంగానూ, కొన్నిటిని కొంచెం కోలగానూ, కొన్నిటిని వంపుగానూ కత్తిరించుకోవాలి. లేతరంగు ముక్కలు శరీర భాగాలకీ, ముదురు రంగు ముక్కలు కిరీటానికీ, ధోవతికీ వాడాలి.

బొమ్మ అతికించవలసిన బట్టని (ఆకుపచ్చది) నాలుగువైపులా వెనక్కి ఒక అరసెంటీమీటరు మడిచి ఫెవికోల్‌తో అతికించాలి పోగులు బయటికి కనిపించకుండా. ముందువైపు నీట్‌గా కనిపిస్తుంది. బట్టని నిలువుగా పెట్టుకోవాలి బల్లమీద. అప్పుడు, దాని మీద మధ్యలో "పొట్ట" కోసం కత్తిరించిన లేతరంగు పెద్ద బట్టముక్కని అతికించాలి.

దీనికి పైభాగంలో, అంటే మెడమీద "తల"కోసం కత్తిరించిన లేత రంగు ముక్కని అతికించాలి-ఒకదాని మీద ఒకటి కాకుండా అంచులు కలిసేటట్లు వస్తే చాలు. 'చెవుల'కోసం కత్తిరించుకున్న లేత రంగు ముక్కల్ని తలకి ఇటుపక్కనా, అటుపక్కనా అంచులు కలిసేటట్లు అతికించుకోవాలి. చెవి వంపుదగ్గర ఖాళీ లేకుండా కొద్దిగా తల అంచుమీదకి వచ్చేటట్లు చూసుకోవాలి.

తలమీద 'కిరీటం'కోసం కత్తిరించుకున్న ముదురు రంగు ముక్కని నుదురు మీదికి తగిలేటట్లు అంటించాలి. 'చేతుల'కోసం కత్తిరించుకున్న ముక్కలు నాలుగు. రెండు పెద్దవి, రెండు చిన్నవి. లేత రంగు పెద్ద ముక్కల్ని కొన కిందికి వచ్చేటట్లు పొట్టకి ఇటుపక్క ఒకటీ, అటుపక్క ఒకటీ భుజం ఉండేచోట అతికించుకోవాలి. చిన్న ముక్కల్లో ఒకటి కొనపైకి వచ్చేటట్లూ (బొమ్మ కుడిచేతికి), రెండవది కొనకిందికి వచ్చేటట్లూ పెద్ద ముక్క కొనమీద అతికించాలి కొద్దిగా. (తరవాత కొంతభాగం తొడమీదికి వచ్చేటట్లు ధోవతి ముక్కమీద అతికించాలి).

ఇప్పుడు, ముదురురంగు పెద్ద ముక్కల్ని పొట్ట కింద ఇటొకటీ, అటొకటీ ఎడంగా (మధ్య జాగా వదిలి) అతికించాలి. ముదురురంగు చిన్న ముక్కల్ని మధ్య జాగాలో పొట్టకింద ఇటొకటీ అటొకటీ పెద్ద ముక్కల మీదికి కొద్దిగా వచ్చేటట్లుగా పెట్టి అతికించాలి. ఆ రెండు ముక్కల మధ్యనా, కొనపైకి వచ్చేటట్లు ముదురురంగు పెద్దముక్కని (కుచ్చెళ్లలా కనిపించేది) అతికించాలి.

తొండం ఆకారంలో కత్తిరించుకున్న లేత రంగు బట్టముక్క వెడల్పు కొసని వినాయకుడి ముఖం మీద మధ్యలో అతికించి, తరువాత, తక్కిన భాగాన్ని కిందికి భుజం వరకూ అతికించాలి.

సన్నని జరీ అంచు (చంకీ రిబ్బను) ముక్కల్ని వినాయకుడి భుజాలమీదుగా కాలికింద వరకూ వ్రేలాడుతున్నట్లు ఇటొకటీ, అటొకటీ మెడదగ్గర నుంచి కింద వరకూ అతికించాలి. మొత్తం ఒక అర్ధమీటరు లేసు సరిపోతుంది. కిరీటానికి కూడా జరీ ముక్కలు మూడు వైపులా అతికించాలి.

తెల్లని చంకీ రిబ్బను ముక్కనిగాని, తెల్లదారాన్నిగాని జంధ్యం లాగ అతికించాలి. తరువాత, ఫాబ్రిక్ పెయింట్స్‌తో, సన్నని బ్రష్ తీసుకుని వినాయకుడి కళ్లనీ, బొట్టునీ, దంతాల్నీ, పెయింట్ చెయ్యాలి. బొడ్డుకి ఒక చుక్క పెట్టాలి. బొమ్మ చుట్టూ అంచులమీద (రేకుల అంచుల మీద) అవే రంగులతో గీతలాగ పెయింట్ చెయ్యాలి-కత్తిరించిన పోగులు కనిపించకుండా.

ఇంట్లో గోడకి తగిలించుకోవడానికే కాకుండా, ఎవరికైనా బహుమతిగా ఇవ్వడానికి కూడా బావుంటుంది చిత్రం.






# 13. అట్టముక్కలతో వినాయకుడు

వినాయకుణ్ణి అనేక విధాలుగా చెయ్యవచ్చు. అట్టముక్కలూ, బట్ట ముక్కలూ పెట్టి చెయ్యడం ఒక పద్ధతి- గ్రీటింగ్ కార్డ్ సైజులో చిన్నదిగాని, గోడని అలంకరించుకునేందుకు కొంచెం పెద్ద సైజులోగాని చేసుకోవచ్చు. వీటిని ఫెవికోల్‌తో అతికిస్తూ చేసుకోవచ్చు. లేదా, సూదితో కుట్టి అతికించుకోవచ్చు.

చిన్న బొమ్మలకైతే వాయిల్ లాంటి పల్చని, మెత్తని బట్టకావాలి. మరీ పెద్ద బొమ్మలకైతే ముతకబట్ట - ఖద్దరు, కేస్‌మెంట్, పాప్లిన్ వంటిది పనికొస్తుంది.

"ఫాల్" బట్ట ఒక అరగజం పొడుగుది లేత రంగులో (లేత కనకాంబరం, లేత గులాబీ, లేత నీలం, ఏదైనా) కావాలి. మరొక అరగజం పొడుగుది ముదురు రంగులో కావాలి. ఆ సైజులో బట్టముక్కలు ఏవయినా పనికొస్తాయి "ఫాల్"కి బదులు. ముదురు రంగులో కనకాంబరంగాని, ఎరుపుగాని బావుంటుంది.

ఇవికాక, ఒక పావు మీటర్ సన్నని చంకీలేసు (రిబ్బనులాంటిది), "సర్జికల్ కాటన్" (తెల్లని దూది) కొంచెం కావాలి. బొమ్మ అంటించుకునేందుకు గ్రీటింగ్‌కార్డు సైజులో ఒక అట్ట ఉండాలి. బజారులో దొరికే లేత పసుపురంగు పల్చని అట్టని కొనుక్కోవచ్చు. రెప్లై పోస్ట్‌కార్డ్‌లా కత్తిరించుకుని, మడిచి, పై కార్డు మీద బొమ్మని అతికించుకోవచ్చు. లేదా, ఏదైనా ఒక మంచి 'ఇన్విటేషన్ కార్డు' మీద (వెనక తెల్లగా ఉండాలి) అక్షరాలు కనిపించకుండా, పైన లేత పసుపురంగుదిగాని, మరే రంగుదైనా బట్టని ఫెవికోల్‌తో అతికించాలి. అప్పుడు ఆ బట్ట అతికించిన కార్డుమీద బొమ్మని అతికించవచ్చు.

గ్రీటింగ్‌కార్డు మీద అతికించుకునేందుకు వీలుగా చిన్న సైజులో అట్టముక్కల్ని (బొమ్మలో చూపించిన ఆకారంలో) కత్తిరించుకోవాలి (అట్ట దళసరిగా ఉండాలి). అట్ట ముక్కలకన్న చుట్టూ ఒక సెంటీమీటరు ఎక్కువగా బట్టముక్కల్ని కత్తిరించుకోవాలి. మరీ చిన్న ముక్కలకయితే, చుట్టూ ఒక అర సెంటీమీటరు ఎక్కువ ఉంటే చాలు. తల, చెవులూ, తొండం, పొట్ట, చేతులూ, కాళ్లూ- ఈ భాగాలకి లేతరంగు బట్టని కత్తిరించుకోవాలి. కిరీటం, ధోవతి (కాళ్లు, కుచ్చెళ్లు) కోసం ముదురు రంగు బట్టని కత్తిరించుకోవాలి.

అట్ట ముక్కల ఆకారంలోనే దూదిపొరని (సర్జికల్ కాటన్ బండిల్ లోనిది) కత్తిరించుకోవాలి - దూదిపొర మీద, కత్తిరించుకున్న అట్టముక్కని తలకిందుగా పెట్టి, అట్ట ముక్కతో సమానంగా దూదిపొరని కత్తిరించుకోవాలి (చేతులు, తొండం వంటి భాగాలు తలకిందుగా పెట్టి కత్తిరించకపోతే కుడివైపుది ఎడమదిగానూ, ఎడమవైపుది కుడివైపుదిగానూ వస్తుంది తిరగేసి బట్టవేసి కుట్టినప్పుడు)

ఇప్పుడు అట్టముక్క కింది దూదిపొర ముక్కతోబాటు బట్టముక్క మీద పెట్టి, బట్టముక్క అంచుల్ని లోపలివైపుకి అట్టముక్కమీద అతికించాలి. అతికించేటప్పుడు 'అసలువైపు' ముడతలు రాకుండా చూసుకోవాలి. ఎక్కడైనా వంపు ఉన్నచోట బట్ట అంచుని కొద్దిగా కత్తిరిస్తే ముందువైపు ముడతలు రావు. అతికించాక, బల్లమీద పెట్టి వేళ్లతో నొక్కితే బాగా అతుక్కుంటుంది. ఫెవికోల్ వాడకుండా, అంచులు కలిపి కుట్టినట్లయితే, నొక్కి పెట్టవలసిన అవసరం ఉండదు. ఒకవేళ ఎక్కడయినా పొరపాటు జరిగినా కుట్టు విప్పిసరిచేసుకోవచ్చు. (కుట్టు విప్పవలసివస్తే సూదితో గట్టిగా తెంపడానికి ప్రయత్నించకూడదు. చినకత్తెరతో ఒకపోగు కత్తిరిస్తే తక్కిన కుట్లు వదులై, కుట్లు కత్తిరించడానికి వీలవుతుంది).

అన్ని అట్టముక్కలూ పైవిధంగా తయారుచేసుకున్న తరవాత, వాటిని బొమ్మలో చూపించినట్లుగా ఫెవికోల్‌తోగాని

కుట్టుతోగాని ఒకదాని కొకటి జోడించి అతికించాలి. ఫెవికోల్‌తో అయితే, గ్రీటింగ్ కార్డు మీద ఒక్కొక్కటే దగ్గరదగ్గరగా బొమ్మలో ఉన్నట్లుగా అతికించాలి.

కుట్టుతో అయితే, అన్ని భాగాలూ అతుక్కుని, బొమ్మంతా తయారయాక, దాని వెనక ఫెవికోల్‌పూసి గ్రీటింగ్ కార్డు మీద అతికించవచ్చు.

గోడమీద అలంకరించుకోవాలంటే, ఆ బొమ్మని ఒక బట్టముక్క మీద (బొమ్మకి సరిపడేటంత బట్ట - చుట్టూ బట్ట మిగిలేటట్లుగా) అతికించుకోవాలి. ఆ బట్టని 'చిన్నచాప' మీద అతికించి, వ్రేలాడేసేందుకు వీలుగా ఒక మంచి తాడుముక్కని (మొలతాడు వంటిది) చాప వెనకపై భాగంలో అంచుమీద అతికించాలి. కుట్టుతో అతికిస్తే గట్టిగా ఉంటుంది.

చాపలేకపోతే, ఒక అట్టనిగాని, వాల్ పేపర్ వంటిదాన్ని గాని అతికించవచ్చు.






# 14. అట్టముక్కలతో వటపత్రశాయి

అట్ట ముక్కలతోనూ, బట్ట ముక్కలతోనూ 'వటపత్రశాయి'ని చెయ్యవచ్చు - చిన్నది కావాలంటే చిన్నదిగానూ, పెద్దది కావాలంటే పెద్దదిగానూ. ఏ సైజులో కావాలంటే ఆ సైజులో అట్టముక్కల్ని బొమ్మలో చూపించిన విధంగా కత్తిరించుకోవాలి. బట్టముక్కల్ని అట్టముక్కల కన్నా పెద్దగా కత్తిరించుకోవాలి - చిన్నముక్కలకి అర సెంటీమీటరూ, పెద్దముక్కలకి సెంటీమీటరూ ఎక్కువ ఉంటే సరిపోతుంది.

ఈ కృష్ణుడి బొమ్మకి కావలసిన వస్తువులు- దళసరి అట్టముక్క, దూది పొర (సర్జికల్ కాటన్ లోనిది), లేత నీలం రంగూ, పసుపు రంగూ, ఆకుపచ్చ రంగూ, నలుపు రంగూ బట్టముక్కలూ, చంకీ లేసులూ. బొమ్మలో చూపించిన సైజులోకయితే చిన్నచిన్న బట్టముక్కలు సరిపోతాయి. చంకీలేసులు రెండు రకాలు బంగారం రంగువీ, ఒకటి వెండి రంగుదీ కావలసి ఉంటుంది. చిన్నచిన్న ముక్కలు చాలు.

అట్టముక్కల్ని బొమ్మలో చూపించినట్లుగా ఆరు ముక్కల్ని (తల, శరీరంలో మధ్యభాగం, చేతులూ, కాళ్లూ) కత్తిరించుకోవాలి. లేత నీలం రంగు బట్టముక్కల్ని కూడా అదే ఆకారంలో కొంచెం పెద్దగా అరింటిని కత్తిరించుకోవాలి.

బట్టముక్కమీద దూదిపొరనీ, దానిమీద అట్టముక్కనీ పెట్టి బట్ట అంచుల్ని మధ్యకి లాగి కుట్టాలి, లేదా ఫెవికోల్‌తో అతికించుకోవాలి- ముందువైపు ఎక్కడా ముడతలు రాకుండా చూసుకోవాలి.

చేతులూ, కాళ్లూ కుట్టేటప్పుడు, కుడీ, ఎడమా సరిగ్గా వచ్చేటట్లు చూసుకోవాలి. అంటే, ఉదా- కుడిచెయ్యి కుట్టేటప్పుడు అట్టముక్కని కావలసిన విధంగా పెట్టి, దానిమీద దూది పొరనీ, బట్టముక్కనీ, పెట్టి, కదిలిపోకుండా మొత్తం తిరగేసి పట్టుకుని, అంచులు కలిపి కుట్టాలి. కుట్టిన తరువాత వెనక్కి తిప్పితే కావలసిన 'పొజిషన్'లో ఉంటుంది.

బొమ్మ భాగాలన్నిటినీ కుట్టుకున్న తరువాత, పసుపురంగు బట్టముక్కని బొమ్మ మధ్య భాగం మీద పెట్టి, నడుమునుంచి కిందవరకూ వచ్చేటట్లు కప్పి, బట్ట అంచుల్ని వెనకవైపుకి మడిచి కలిపి కుట్టాలి. అలాగే, పసుపు రంగు బట్టముక్కల్ని కాళ్ల రెండింటికీ మోకాలు వరకూ వచ్చేటట్లు కప్పి కుట్టాలి.

ఒక రకం బంగారం రంగు చంకీ లేసుని మోకాళ్ల దగ్గర పసుపు రంగు బట్టమీద అంచులాగ కుట్టాలి. మరో రకం బంగారం రంగు చంకీ లేసుని చేతులకి దండల దగ్గరా, ముంజేతి దగ్గరా కుట్టాలి ఆభరణాలు లాగ. తెల్ల చంకీ లేసుని కాళ్లకు వెండి గొలుసులాగ కుట్టాలి. రెండు కాళ్ల మధ్యనుంచీ కిందికి కొద్దిగా వ్రేలాడేటట్లు చంకీలేసు అంచుల్లాగ కుట్టాలి.

తలకి నలుపు బట్టగాని, పల్చని ఫెల్ట్‌గాని కుట్టేటప్పుడు, చెంపలకింద వరకూ గిరజాలు వచ్చేటట్లూ, పైన ఒకవైపుకి జుట్టు కుచ్చులా వచ్చేటట్లూ కుట్టాలి - లేత నీలం రంగు బట్ట కుట్టిన ముఖానికి నుదుటి దగ్గర మొదలు పెట్టి నలుపు బట్టని కుట్టాలి. పైన పింఛంలాగ ఒక ఆకుపచ్చ బట్టని ఆకులా కత్తిరించి దానిమీద నీలం రంగూ, పసుపు రంగూ చంకీ బిళ్లలు గాని, బట్టముక్కలుగాని కుట్టాలి. జుట్టు 'కుచ్చు' చుట్టూ చంకీ లేసు కుట్టాలి.

తరవాత, బొమ్మ భాగాలన్నిటినీ ఒకదానికి ఒకటి అతకాలి. రెండేసి భాగాల్ని తీసుకుని, వాటిని తిరగేసి, కుట్లున్నవైపు ండింటినీ కలుపుతూ కుట్టాలి - సూదీ దారాన్ని ఒకసారి ఒక భాగం అంచులోంచీ, ఒకసారి రెండవ భాగం అంచులోంచీ నిస్తూ గట్టిగా లాగి కుట్టాలి. ఏ 'పొజిషన్'లో రావాలో ముందుగానే చూసుకుని, ఆవిధంగా జోడించాలి. బొమ్మలో చూస్తే కాళ్లూ, చేతులూ ఎలా అమర్చాలో తెలుస్తుంది.

ఇప్పుడు ఆకుపచ్చ రంగు బట్టముక్కని తీసుకుని ఆకు ఆకారంలో కత్తిరించుకోవాలి. ఆ బట్టముక్క కింద అదే సైజులో పల్చని అట్టముక్కని (ఫాల్ లోపల ఉండే అట్టలాంటిది) అతికించాలి. ఆకుపైన కాడ దగ్గర వెనకవైపు ఒక తాడుముక్కని (సన్నని మొలతాడు వంటిది) గొలుసులా అతికించాలి - గోడమీద వ్రేలాడదీసేందుకు వీలుగా.

కృష్ణుడి బొమ్మకి కళ్లూ, ముక్కూ, నోరూ, బొట్టూ పెయింట్ చెయ్యాలి ఫాబ్రిక్ పెయింట్స్‌తో. రంగులు ఆరిన తరవాత, కృష్ణుడి బొమ్మని ఆకు మధ్యన ఫెవికోల్‌తో అతికించాలి. అంతే!











# 15. అట్టముక్కలతో పాకేకృష్ణుడు

ముందుగా కొన్ని విషయాలు చెప్పాలి. చిన్నబొమ్మలు చెయ్యడం కష్టం, పెద్దవి చెయ్యడం సులభం అనిపించవచ్చు ఎవరికైనా, కానీ, వేటి పనితనం వాటిది, వేటి అందం వాటిది. అదీకాక, చిన్న బొమ్మలకి కావలసిన బట్టలూ, చంకీలూ, దూదీ మొదలైనవి చాలా తక్కువ, ఖర్చూతక్కువే. కొంచెం శ్రద్ధతో ఓపిగ్గా చేస్తే, చిన్న బొమ్మలే మరింత ఆకర్షణీయంగా ఉంటాయి- చిన్నపిల్లల్లాగే.

"పాకే కృష్ణుడి" బొమ్మని అట్టముక్కలతోనూ బట్టముక్కలతోనూ చేసుకోవచ్చు. కొంచెం దళసరిగా, గట్టిగా ఉండే అట్టముక్కని తీసుకుని, తల, శరీరంలో మధ్యభాగం, చేతులూ, కాళ్లూ బొమ్మలో చూపించినట్లుగా కత్తిరించుకోవాలి. లేత నీలరంగు బట్టముక్కని తీసుకుని (ఇంట్లో బట్టముక్కలు లేకపోతే 'ఫాల్స్' కొనుక్కుంటే బోలెడు బొమ్మలు చేసుకోవచ్చు), అట్టముక్కల కన్నా పెద్దగా అవే ఆకారాల్లో కత్తిరించుకోవాలి. అట్టముక్కల సైజులోనే, అవే ఆకారాల్లో ఒక దూది పొరని (సర్జికల్ కాటన్) తీసుకుని కత్తిరించుకోవాలి.

బట్టముక్క మీద దూది పొరనీ, దానిమీద అట్టముక్కనీ పెట్టుకుని, ఇటూ అటూ కదిలిపోకుండా పట్టుకుని, బట్ట అంచుల్ని అట్టముక్క మీదికి మడిచి, రెండు వైపుల అంచుల్నీ కలిపి అతకాలి- ఒకసారి ఒకవైపు అంచులోంచీ, ఒకసారి రెండవవైపు అంచులోంచీ సూదీ దారాన్ని పోనిస్తూ మెల్లగా దగ్గరగా లాక్కుంటూ అతుక్కోవాలి. అసలువైపు ఎక్కడా ముడతలు రాకుండా కుట్టుకోవాలి. సన్ననిసూది వాడటం మంచిది- బట్టపోగులు ఊడిరాకుండానూ, బట్ట చిల్లులు పడకుండానూ ఉంటుంది.

చేతులు కుట్టుకునేటప్పుడు కుడీ, ఎడమా చూసుకుని కుట్టాలి. చెయ్యి ఏ 'పొజిషన్'లో ఉండాలో ముందుగా చూసుకుని, అట్టముక్కని అలాగేపెట్టి, దానిమీద దూదిపొర, దానిమీద బట్టాపెట్టి, మూడింటినీ కలిపి తిరగేసి పట్టుకుని, వెనకవైపు అట్టమీదికి బట్ట అంచులు మడిచి కలిపి కుట్టాలి. అలాగే కాళ్లుకూడా కుట్టుకోవాలి.

చేతుల్ని భుజాలకు అతికేటప్పుడు బొమ్మ కుడిచేతిని కిందివైపు (కుట్లు ఉన్నవైపు) ఆనించి అతుక్కోవాలి; ఎడమచేతిని భుజంపై వైపు ఆనించి అతుక్కోవాలి- బొమ్మలో ఉన్నట్లుగా. బట్టకొసలు కనిపించకుండా అడుక్కి మడిచి అతకాలి. సూదీ దారాన్ని ఒకసారి బొమ్మ చేతిమీది బట్టలోంచీ, ఒకసారి భుజంమీది బట్టలోంచీ పోనిస్తూ, మెల్లగా బిగిస్తూ లాగి కుట్టాలి. కుట్లు పైకి కనిపించకుండా, అడుక్కి లోపలికి వెళ్లేటట్లు చూసుకోవాలి. బొమ్మ కాళ్లని నడుము కింది భాగం చివర అతకాలి- బొమ్మ కుడికాలు ముందుకి వేస్తున్నట్లూ, ఎడమకాలు వెనక్కి సాగి ఉన్నట్లూ కనిపించాలి.

'తల' బిళ్లని (నీలంరంగు బట్టతో కుట్టిన అట్టముక్కని) తీసుకుని, దానికి జుట్టులాగ నల్లని బట్టకుట్టాలి. చుట్టూ గిరజాలు వచ్చేటట్లుగానూ, తలమీద కుచ్చు వచ్చేట్లుగానూ నల్లబట్టముక్కని కత్తిరించుకుని కుట్టాలి. బట్టముక్కని ముక్కోణాకారంలో కత్తిరించుకోవాలి (21/2" × 4" × 21/2")

ముందుగా, నల్లబట్టముక్కని పొడుగువైపు అంచుని మధ్యకి మడిచి, మడిచిన చోట ఒక అరంగుళంమేర ఏటవాలుగా (కిందినుంచి పైకి) కత్తిరించాలి. మడత విప్పితే నుదురు ఆకారంలో కనిపిస్తుంది. దాన్ని బిళ్లపై భాగంలో పెట్టి, మధ్యన నల్లదారంతో టాకాలు వేసి, ఇటూ అటూ చెంపల కిందవరకూ టాకాలు వేసుకోవాలి. మిగిలిన బట్టముక్కల్ని పైకి వదులుగా మడిచి, తలకి ఒకవైపుకు తీసుకొచ్చి కుచ్చులాగ కుట్టాలి. అలాగే, వెనకవైపు బట్టని మెడదాకా వచ్చేట్లు చూసుకుని, మిగిలిన బట్టని వదులుగా మడిచి పైకి తీసుకొచ్చి కుచ్చుతో కలిపి కుట్టాలి. అవసరమైన చోట కదిలిపోకుండా టాకాలు వేసుకోవాలి.

తరవాత, కుచ్చు చుట్టూ చంకీ రిబ్బను ముక్కని కుట్టాలి. ఎరుపు, పసుపు రంగుల్లో చిన్నబట్ట ముక్కల్నిగాని, ఊలు ముక్కల్ని గాని పువ్వుల్లా కనిపించేటట్లు చంకీ రిబ్బను దగ్గర ముందు భాగంలో కుట్టాలి.

ఇప్పుడు పింఛం పెట్టాలి. చిన్న బట్టముక్కని ఆకులా కత్తిరించుకుని దానిమీద నెమలి పింఛంలా పెయింట్ చేసుకోవచ్చు లేదా, ఆకు ఆకారంలో బ్రౌన్‌కలర్ బట్టముక్కని కత్తిరించుకుని, దాని మధ్యన ఆకు ఆకారంలో ఆకుపచ్చరంగు బట్టముక్కని పెట్టి, దానిమధ్య గుండ్రని నీలంరంగు ముక్కనీ, దానికింద చిన్న పసుపురంగు ముక్కనీ (అర్థ చంద్రాకారంలో) పెట్టాలి. అన్నీ చాలా చిన్నవిగా ఉండాలి. అన్నిటినీ కలిపి టాకావేసి కుట్టి, ఆ పింఛాన్ని జుట్టు కుచ్చుకి వెనకగా కొంచెంపైకి కుట్టాలి. పాపిడి దగ్గరా, చెవుల దగ్గరా చిన్న చంకీ బిళ్లలు కుట్టొచ్చు ఆభరణాల్లాగా.

ఆ తరవాత, పసుపురంగు బట్టముక్కని తీసుకుని (అంగుళం వెడల్పూ, మూడంగుళాల పొడుగు ఉండేలాగ), దాని పొడుగులో ఒకవైపున మధ్యన ఒక అరంగుళం మేర చీలిక చెయ్యాలి. బట్టముక్కని బొమ్మ నడుము నుంచి మోకాళ్లపై వరకూ రెండు కాళ్లమీదా పెట్టి, మధ్యన చీల్చిన చోట అంచుల్నీ ఇటూ అటూ మిగిలిన బట్టనీ వెనకవైపుకి మడిచి, నీలంబట్టకి కలిపి అతకాలి.

ఒక సన్నని చంకీలేసుని నడుము చుట్టూనూ, పొట్టమధ్య నుంచి కిందవరకూ, అంటే మోకాళ్లమధ్య వరకూ కుట్టి, కొసని వెనక్కి మడిచి కుట్టాలి (వెనక కుట్లున్న వైపు అతకాలి). మొలకతాడులా పేనిన జరీ (చంకీ) తాడుని మొలతాడులాగ నడుము కింద చుట్టూపెట్టి కుట్టాలి. వెండి చంకీలేసుని- సన్ననిది తీసుకుని, కుచ్చెళ్లులా కూర్చుతీసి దగ్గరికి లాగి, కాళ్లచివర -పాదాలకు పైభాగంలో కుట్టాలి - వెండి మువ్వల గొలుసుల్లా కనిపిస్తాయి.

'తల' బిళ్లని తీసుకుని, మెడ అంచుమీద పెట్టి, ముందుగా వెనకవైపు అతకాలి. తరవాత కుట్లుపైకి కనిపించనీయకుండా ముందువైపు కూడా గడ్డం కింది బట్టలోంచి ఒకసారీ, మెడమీది బట్టలోంచి ఒకసారీ సూదీ దారం పోనిస్తూ టాకాలువేసి, బిగించి అతకాలి.

మెడకీ చేతుల్కకీ సన్నని చంకీలేసులు కుట్టాలి ఆభరణాల్లాగా. మెడలో గొలుసుకి చిన్న పులిగోరు పతకం వెయ్యాలి. తెల్లని అట్టముక్కని (మంచి నున్నని గ్రీటింగ్ కార్డు వంటిది) కత్తిరించుకుని, దానిపైభాగం మీద చంకీముక్క అతికి, ఆ పతకాన్ని గుండెలమీదికి వచ్చేలాగా గొలుసుకి అతకాలి. ఆఖరున బొట్టూ, కళ్లూ, ముక్కూ, నోరూ ఫాబ్రిక్ పెయింట్స్‌తో సన్నని బ్రష్‌తో ('0' నంబర్‌ది) పెయింట్ చేసుకోవాలి. ముందుగా నిలువు బొట్టుగీసి, తరవాత కనుబొమలూ, కళ్లూ, ముక్కూ, ఆఖరున నోరూ పెయింట్ చేసుకోవాలి. చేతివేళ్లకీ, కాలివేళ్లకీ ఎరుపురంగు గీతలు పెయింట్ చేసుకోవాలి.

బొమ్మంతా అయిపోయాక, దాన్ని ఏదైనా చిన్న అట్టమీద గానీ (గ్రీటింగ్ కార్డ్ వంటిది), చిన్న చాపమీదగానీ, చిన్న బొమ్మచేట మీద గానీ ఫెవికోల్‌తో అతికించుకోవచ్చు. అట్టమీద అయితే, ఏదైనా తగినబట్ట ముందుగా అతికించి, దానిమీద బొమ్మ అతికిస్తే బావుంటుంది.

బొమ్మని పెట్టడానికి- అట్టతోనే ఒక కుండని చేసి దానిమీద అతికించవచ్చు. కుండని 'బ్రౌన్'గా పెయింట్‌చేసి, దానిమీద తెలుపురంగు చుక్కలూ, గీతలూ పెయింట్ చెయ్యాలి. లేదా, అట్టమీద 'బ్రౌన్' రంగు బట్టని అతికించి, దానిమీద తెలుపు రంగుతో చుక్కలూ, గీతలూ పెయింట్ చేసుకోవచ్చు బొమ్మని అతికించిన కుండ (అట్ట)కి పైన చిన్నతాడుని వెనకనుంచి కుట్టి, వేళ్లాడదీసుకోవచ్చు.

# 16. బొమ్మలతో కథాచిత్రాలు

అట్టముక్కలూ, బట్టముక్కలూ, దూదీ ఉపయోగించి చేసే బొమ్మల్ని విడివిడిగానే కాకుండా, వాటితో కథాచిత్రాలుగా కూడా తయారుచేస్తే చాలా ఆసక్తికరంగా ఉంటాయి. కావాలంటే, అద్దం వేయించి, ఫ్రేమ్ చేయించి, గోడల్ని అలంకరించుకోవచ్చు. లేదా, ఒక అల్బమ్‌లా తయారుచేసుకుని, బొమ్మలకొలువు వంటి సందర్భాల్లో ప్రదర్శించవచ్చు. మన పురాణాల నుంచీ, కావ్యాలనుంచీ కొన్ని ఘట్టాలను తీసుకుని, వాటిలో వచ్చే పాత్రలను బొమ్మలుగా చేసి, వాటి చుట్టూ అవసరమైన పరిసరాలను సృష్టిస్తే కథాచిత్రాలు తయారవుతాయి. ఉదాహరణకి రామాయణం నుంచీ, జానపద సంప్రదాయాలనుంచీ కొన్ని సన్నివేశాలను ఎంచుకోవచ్చు. అలాగే, చారిత్రక ఘట్టాలను - ఝాన్సీలక్ష్మీబాయి, శివాజీ వంటి వ్యక్తుల కథలను బొమ్మల చిత్రాలుగా తయారు చెయ్యవచ్చు. మన దగ్గర అందుబాటులో ఉన్న సామగ్రితోనే వీలైనంత అందంగా తయారు చేసుకోవచ్చు. దీనికి డ్రాయింగ్‌లో ప్రావీణ్యం ఉండవలసిన అవసరం అంతగా లేదు. పుస్తకాల్లోనూ, పత్రికల్లోనూ, కేలండర్లలోనూ చూసిన చిత్రాల్నిబట్టి మనకి కావలసిన విధంగా చేతనైన విధంగా కాగితంమీద ముందుగా గీసుకుని వాటి ప్రకారం అట్టముక్కల్ని కత్తిరించుకోవాలి. తల, శరీరంలో మధ్యభాగం, కాళ్లూ, పాదాలూ, చేతులూ మొదలైనవి విడివిడిగా కత్తిరించుకోవాలి కాబట్టి అంత కష్టం అనిపించదు.

విడిగా కత్తిరించుకున్న అట్టముక్కల మీద తెల్లని దూదిపొరని వేసి, పైన అవసరమైన బట్టముక్కని వేసి, అంచుల్ని వెనకాలవైపు అతికించాలి. మళ్లీ, వాటిమీద అవసరమైన బట్టముక్కల్నీ, జరీ అంచుల్నీ, చంకీలనీ వేసి అతికించాలి.

తరువాత, అన్నింటినీ ఒకదానితో ఒకటి కావలసిన పద్ధతిలో జతచేస్తూ అతికి, మొత్తం బొమ్మని ఒక దళసరి బట్టమీద అతికించాలి. ముందుగానే ఆనవాలు పెట్టుకోవాలి. ఎక్కడ ఏ బొమ్మరావాలో- చెట్లూ, ఆకులూ, పక్షులూ, జంతువులూ లేదా స్తంభాలూ, తెరలూ, సింహాసనాలూ ఏవి కావాలంటే వాటిని అట్టముక్కలూ బట్టముక్కలూ కలిపిగానీ, విడివిడిగా గాని ఉపయోగించాలి.

ఈ కథాచిత్రాలను తయారు చెయ్యడానికి రెండు మూడు రోజులనుంచి నెలరోజుల వరకూ పట్టవచ్చు మనం ఎంచుకున్న సన్నివేశాల్ని బట్టి. సాధన చేసిన కొద్దీ ఫలితాలు మరింత బావుంటాయి.



# 17. తాటాకుతో లంబాడీ బొమ్మ

ఒకే రకం బొమ్మల్ని రకరకాల వస్తువులతో తయారు చేసుకోవచ్చు. తాటాకుతోనూ, అట్టముక్కలతోనూ, బంతీ, డబ్బా, సీసామూతా, మొదలైన వాటితోనూ - వేటితో చేసినా, వాటికి వేసే దుస్తులూ, అలంకరణా ముఖ్యం- అన్నిటికీ ఒకటే పద్ధతి.

తాటాకుతో బొమ్మ చెయ్యడం మన ప్రాచీన సంప్రదాయం. బొమ్మని తాటాకుతో చేసినా, అలంకరణ అంతా పూర్తయ్యేసరికి ఆకర్షణీయంగా, విలువైనదిగా కనిపిస్తుంది.

ఎండిన తాటాకుని ఒక అరగంట సేపు నీళ్లలో నానబెట్టాలి - మెత్తబడేందుకు. 10 లేక 12 అంగుళాల పొడుగుముక్కని తీసుకుని అంచులు వొంకర లేకుండా సాపు చెయ్యాలి. 3 అంగుళాల పొడుగున్న ముక్కని వేరే తీసుకోవాలి (అన్నీ ఒక అంగుళం వెడల్పు ఉండాలి కనీసం). 10" పొడుగు తాటాకు ముక్కకి పైన ఒక అంగుళం మేరవదిలి, 3" ముక్కని అడ్డంగా వెనకనుంచి పెట్టి, రెండుకొనల్నీ ముందుకి ఒకదాని మీదికి ఒకటి వచ్చేటట్లు మడవాలి. మడిచినవాటి మీద వేలితో నొక్కి పట్టుకుని, వేళ్లాడుతున్న తాటాకు కొనని పై మడతలోంచి దూర్చి, కిందికి లాగాలి. పైన ఒక బిళ్లలాగ ఏర్పడుతుంది. వేళ్లాడుతున్న తాటాకు కొనని ఈసారి వెనక వైపు కింద నుంచి దూర్చి పైకి కొంచెం కొంచెం లాగాలి- పైన ఒక అంగుళం పొడుగు 'రింగ్'లాగ వచ్చేటట్లు చూడాలి. అది బొమ్మ తల అవుతుంది.

వేళ్లాడుతున్న తాటాకు కొనని మళ్లీ వెనకవైపు కిందనుంచి 11/2" మేర దూర్చాలి. అప్పుడు, బిళ్ల కింద కూడా పొడుగు రింగ్ ఒకటి ఏర్పడుతుంది. దాన్ని కింద నుంచి ఒక అంగుళం మేర మధ్యన నొక్కి, రెండు వైపుల్నీ దగ్గరికి నొక్కాలి- బొమ్మకింద తాటాకు అడ్డంగా, కొంచెం వొంపుగా వస్తుంది. దీనివల్ల బొమ్మ దానంతట అది నిలబడగలుగుతుంది.

తలకింద ఉన్న బిళ్ల (బొమ్మఛెస్ట్)లోంచి (మొదటి మడత లోంచి) అడ్డంగా 41/2" పొడుగూ, ఒక అంగుళం వెడల్పూ ఉన్న తాటాకు ముక్కని దూర్చాలి. ఇటూ అటూ తాటాకు ముక్క అంచుల్ని కొద్దిగా ఏటవాలుగా కత్తిరించాలి రెండువైపులా- అవి రెండూ చేతులు.

ఇప్పుడు బొమ్మకి లంబాడీ దుస్తులు వెయ్యాలి. ముందుగా, తలపైన నల్లని బట్టముక్కని అతికి, వెనకాల మూడుపాయలుగా చీల్చి చిన్న జడవెయ్యాలి. లంబాడీ డ్రెస్‌కి సాధారణంగా, ఎరుపూ, పసుపూ లేదా కనకాంబరం రంగూ, ఆకుపచ్చా, లేదా నీలం రంగూ ముదురు రంగుల బట్టలు వాడతారు. కనీసం మూడు రంగులుంటే బావుంటుంది. ఒక రంగుబట్ట మీద మరో రంగుదారంతో అద్దాలూ, డిజైన్లూ కుట్టాలి. అద్దాల బదులు తెల్లని పెద్ద చంకీ బిళ్లలు వాడొచ్చు. పరికిణీకి బాగాకుచ్చెళ్లు ఉండాలి.

జాకట్టులాగ- ఒక నలుచదరపు బట్టముక్కకి కింద అంచుకుట్టి, పైన అద్దాలతో డిజైనుకుట్టి, దాన్ని ఛెస్ట్‌మీద పెట్టాలి. బట్టముక్కకి రెండు పక్కలా చిన్న తాళ్లు కుట్టి, వెనకాల వీపుమీద ముడి వెయ్యాలి. మెడ ఆకారంలో పైన కొద్దిగా మడిచి టాకా వెయ్యాలి. జాకట్టు చేతులు ఒక అరంగుళం పొడుగు ఉండేలాగ, చేతికి బట్ట ముక్కని చుట్టి అతకాలి. జాకట్టు చేతినీ, ముందు భాగాన్నీ కలుపుతూ భుజం దగ్గర అతకాలి. నడుము దగ్గర ముందు భాగంలో, జాకట్టు ముక్కకి వేళ్లాడేలాగ మూడు చిన్న చదరపు ముక్కల్ని అతకాలి. వాటిమీద కూడా అద్దాలు కుట్టాలి. పరికిణీ మీదికి ఆ ముక్కలు వచ్చేటట్లు సర్ది, టాకాలు వెయ్యాలి.

తలమీద నుంచి ఎర్రని బట్టతో ముసుగు వెయ్యాలి కిందివరకూ వేళ్లాడేటట్లు. దాని అంచుకి కూడా అద్దాలు కుట్టాలి. తెల్లగా మెరిసే కార్డ్ (గ్రీటింగ్ కార్డ్)ని సన్నగా పొడుగ్గా కత్తిరించి, రింగుల్లాగ తయారుచేసి బొమ్మ చేతులకి నాలుగైదు చొప్పున తొడగాలి. ఊడిపోకుండా అతికించాలి. తలమీద వేసిన ముసుగు కొసల్ని చేతులతో పట్టుకున్నట్లు పెట్టి టాకాలు వెయ్యాలి. చిన్న చిన్న తెల్ల పూసలూ, నల్లపూసలూ, తెల్లని చంకీ బిళ్లలూ, తెల్లని చంకీ లేసులూ ఉపయోగించి ఆభరణాలు పెట్టాలి.

తాటాకు బదులు, దళసరి అట్టతో పెద్ద బొమ్మ చేసినా, అలంకరణ పై విధంగానే చెయ్యాలి.



లంబాడీ బొమ్మ
(అట్ట ముక్కలతో)



# 18. వెన్నదొంగ కృష్ణుడి బొమ్మ

ఖాళీ అయిన లిప్‌స్టిక్ గొట్టంతోగాని, చిన్న గ్లిసరిన్ సీసాతోగాని వెన్నదొంగ - కృష్ణుడి బొమ్మని చెయ్యొచ్చు. తలకాయకి చిన్న చెక్కపూసనిగాని ప్లాస్టిక్ పూసనిగాని వాడాలి. మెడకి చిన్న రబ్బరు ముక్కని వాడొచ్చు.

పూసనీ, గొట్టాన్నీ ముందుగా లేత నీలం రంగు బట్టతో కప్పి కుట్టాలి. 'మెడ'గా పెట్టే రబ్బరు ముక్కని కూడా గొట్టం మీద పెట్టి ఒకేసారి బట్టతో కుట్టి, తరవాత తలని మెడమీద పెట్టి అతకాలి.

తలమీద నలుపు రంగు బట్ట ముక్కతో గిరజాల జుట్టులాగ అతకాలి. గొట్టం మధ్య నుంచి కిందివరకూ పసుపురంగు బట్ట ముక్కతో ధోవతిలాగ చుట్టి కుట్టాలి.

దళసరి అట్టముక్కల్ని పాదాలు లాగ కత్తిరించి, లేత నీలం రంగు బట్ట అతికించి, గొట్టం కింద అతకాలి.

లేత నీలం రంగు బట్టముక్కల్ని కొంచెం లావుగా చుట్టి. అంచు అతికించి, గొట్టానికి ఇటూ అటూ చేతుల్లాగ పెట్టి, గొట్టంమీది బట్టకి అతకాలి. కుడిచేత్తో వెన్నముద్ద పట్టుకుని నోటి దగ్గర పెట్టుకోబోతున్నట్లుగానూ, ఎడమ చేతిని వెనక్కి పెట్టుకుని ఏదో దాచుకుంటున్నట్లుగానూ చేతులు మడిచి కుట్టినట్లయితే, వెన్నదొంగలా కనిపిస్తుంది బొమ్మ.

తగిన బట్టముక్కలు కత్తిరించి తలమీద పువ్వుల్నీ, పింఛాన్నీ కుట్టాలి. చంకీ లేసుల్ని, ఆభరణాలుగానూ, ధోవతి అంచులుగానూ వాడాలి. బొమ్మల కొలువులో పెట్టినట్లుగా, వెనకాల గూట్లో వెన్నకుండలు ఉన్నట్లుగా అట్టముక్కల్ని కత్తిరించి, రంగులు వేసి పెట్టుకోవచ్చు.






# 19. కథాకళీ డాన్స్ బొమ్మ

భారతీయ నృత్య రీతులు ఎన్నో ఉన్నాయి. వస్త్రధారణని బట్టీ, అలంకరణని బట్టీ వాటి ప్రత్యేకతను సులభంగా తెలుసుకోవచ్చు. ఏ బొమ్మలు చెయ్యాలన్నా, అన్నిటినీ కుతూహలంగా పరిశీలించడం, పరిశీలించిన దాన్ని ప్రయోగించడం అలవరచుకుంటే, ఎన్నిరకాల బొమ్మలైనా చెయ్యొచ్చు.

కథాకళీ నృత్యానికి పురాణ కథల్లోని పాత్రలకు వివిధ రకాలుగా వస్త్రధారణ చేస్తారు. వస్త్రధారణతోబాటు ముఖానికి కూడా విలక్షణమైన అలంకరణ చేస్తారు. సాధారణంగా కనిపించే ఒక రకం వేషంలో ముఖ్య లక్షణాలు – ముఖానికి ఆకుపచ్చరంగూ, కోలగా కొనలు తేరిన పెద్దకళ్లు, మూతిచివర్ల ఎర్రని చుక్కలూ, గడ్డం చుట్టూ వంపు తిరిగిన తెల్లని మరోగడ్డం ఉంటాయి. చెవులకు పెద్ద పెద్ద గుండ్రని ఆభరణాలు రెండేసి చొప్పున ఉంటాయి - ఒకదాని కింద ఒకటి. నుదిటి మీద వెడల్పుగా నామం – ఇంగ్లీషు `V' ఆకారంలో - తెలుపు గీతల మధ్య ఎర్రని నిలువు బొట్టు ఉంటుంది. జుట్టు పొడుగ్గా నడుము కింది వరకూ వదులుగా వేళ్లాడుతూ ఉంటుంది. కిరీటం ముందు భాగంలో ఆర్చిలా నుదుటి చుట్టూ వచ్చి, నెత్తిమీద మధ్యన ఒక గోపురంలా ఉండి, వెనకాల గుండ్రని పళ్లెం లాంటిది ఒకటి ఉంటుంది. అన్నీ బంగారం రంగులో, రంగు రంగుల రాళ్లు పొదిగినట్లుగా ఉంటాయి. పొడుగు చేతుల చొక్కా ముదురు ఎరుపు రంగులో ఉంటుంది, భుజాలకి భుజకీర్తులు (ఆభరణాలు) ఉంటాయి. చేతి చివర, చొక్కా మీద కంకణాలు ఉంటాయి. రెండింటికీ బంగారపు గుల్లు ఎత్తుగా పొడుచుకొచ్చినట్లు ఉంటాయి. మెడచుట్టూ కంటెలాంటి ఆభరణానికి బోలెడు పూసల హారాలు తాళ్లలా వేళ్లాడుతూ ఉంటాయి - నడుము వరకూ. మెడ మీంచి మోకాళ్ల వరకూ ఉత్తరీయాలు రెండు మూడు తాళ్లలా వేళ్లాడుతూ ఉంటాయి. వాటి చివర మంచి మంచి అంచులు విసినకర్రల్లా కట్టి ఉంటాయి. బొడ్డు నుంచి మోకాలి వరకూ బాగా అలంకరించిన ఒక బట్ట `V' ఆకారంలో వేళ్ళాడుతూ ఉంటుంది. నడుముకి ఇటూ అటూ పక్కల్ని కూడా రెండు ముక్కలు రిబ్బన్లలా వేళ్ళాడుతూ ఉంటాయి. తెల్లని ధోవతి బోలెడు కుచ్చెళ్లతో పరికిణీలా కట్టి ఉంటుంది. అయితే, మామూలు పరికిణీలా కాకుండా నడుము దగ్గర నుంచి చుట్టూ ఎత్తుగా లేచి కిందికి గంప బోర్లించినట్టుగా ఉంటుంది. ధోవతి చివర అంచుకి కొంచెం పైన మూడు నాలుగు - వెడల్పు చారల అంచులుంటాయి రంగువి. కాళ్లకి గజ్జెలుంటాయి. బొమ్మని, కూర్చున్నట్లుగా చేస్తే కాళ్ల గజ్జెలూ, పాదాలూ లేకుండా చెయ్యొచ్చు.

ఈ బొమ్మని డబ్బా మూతలూ, చిన్న బంతిగాని పింగ్‌పాంగ్ బాల్‌గాని ఉపయోగించి చేసుకోవచ్చు. ముఖానికి బంతిబదులు కోలగా వెడల్పుగా ఉన్న ప్లాస్టిక్ మూతని కూడా వాడుకోవచ్చు. ముఖానికి పెట్టే తెల్లని గడ్డానికీ, కిరీటం వెనక భాగానికీ అట్టముక్కల్ని వాడొచ్చు. కిరీటం చెయ్యడానికి రెండు మూడు సైజుల్లో మూతల్ని ఒకదాని మీద ఒకటి పెట్టి, పైన బట్టవేసి కుట్టి, దాని మీద చంకీ రిబ్బనువేసి కుట్టి తయారు చెయ్యొచ్చు. లేదా, పాత చంకీదండల్లో మధ్య ఉండే కర్రముక్కల్ని (కిరీటం ఆకారంలో ఉంటాయి) చంకీ రిబ్బను కుట్టివాడుకోవచ్చు.

శరీరం మధ్య భాగాన్ని బట్టతోకుట్టి, నడుము నుంచి కింది వరకూ డబ్బాని ఉపయోగించవచ్చు. శరీరం మధ్య భాగానికి బట్టని కత్తిరించి గలేబులా కుట్టి, అందులో దూదిని బాగా కూరాలి. లేదంటే, అందుకు తగిన మరో చిన్న డబ్బాని జతచేసి చెయ్యొచ్చు. లేదా, మొత్తం ఒకే డబ్బాని మెడ నుంచి పాదాల వరకూ ఉపయోగించవచ్చు.

# 20. ప్రసిద్ధ వ్యక్తుల బొమ్మలు

ప్రసిద్ధ వ్యక్తుల 'కార్టూన్స్' వేసినట్లుగానే, వారిలా కనిపించే బొమ్మల్ని కూడా సులభంగా చెయ్యొచ్చు సరదాగా. సాధన చేసిన కొద్దీ మరింత బాగా వస్తాయి.

చిన్న సెంటు సీసామీద చెక్కపూసనిగాని, ప్లాస్టిక్ పూసనిగాని అతికించి, వాటికి రంగులువేసి చాచానెహ్రూ బొమ్మని చెయ్యొచ్చు. తెల్లని బట్ట ముక్కతో టోపీ చేసి నెత్తిమీద అతికించడం, 'కోటు'మీద ఎర్రని బట్టముక్కతో చేసిన గులాబీ పువ్వుని అతికించడం ముఖ్యం.

అలాగే, ఇతర వ్యక్తుల ముఖ్య లక్షణాలను దృష్టిలో పెట్టుకుని రకరకాల వస్తువుల్ని ఉపయోగించి బొమ్మలు చెయ్యొచ్చు. ఉదాహరణకి - రాలి ఎండిపోయిన బాదం కాయనీ, ఒక చిన్న సీసానీ ఉపయోగించి 'మదర్' బొమ్మని చెయ్యొచ్చు. ఎండిన బాదంకాయకి పైనాకిందా కోసుగా ఉన్న భాగాన్ని కత్తిరించి, దానిపైన బట్టవేసి కుట్టి ముఖాన్ని తయారు చేసుకోవచ్చు. ముక్కుకి అట్టముక్కని వాడాలి. చేతులు చెయ్యాలంటే బట్టముక్కని గొట్టంలా చుట్టి అతకాలి. తెల్లని బట్టకి నీలంరంగు అంచులువేసి చీరలాగ కట్టాలి. తలమీద కొంగు కప్పాలి. చేతులకి పొడుగు చేతుల జాకట్టు వెయ్యాలి.

ఒక పాత రబ్బరు బొమ్మ ముఖాన్నీ, కొబ్బరి చిప్పనీ తీసుకుని, బట్టలు కుట్టి మరోరకం బొమ్మ చెయ్యొచ్చు. రబ్బరు బొమ్మ ముఖం మీద మళ్లీ ముఖం రంగు బట్టని వేసి కుట్టి, ముక్కుమీద మరో చిన్న అట్టముక్కని త్రికోణాకారంలో కత్తిరించి బట్టముక్కతో కప్పి అతికించాలి. సిగచుట్టి, చెవులకు దిద్దులు పెట్టాలి. ఎర్రని బొట్టుపెట్టి, పైన తెల్లని గీత గీయాలి. కొబ్బరిచిప్ప చుట్టూ ముందుగా, బట్టతో కప్పి కుట్టి, దానిమీద రబ్బరు బొమ్మ ముఖాన్ని అతికించాలి. మెడనుంచి నడుమువరకూ వదులుగా బట్ట కుట్టాలి 'కేప్'లా.

(అముద్రిత వ్యాసం)



# 21. దూది కూరిన బట్టబొమ్మ

దూది కూరిన బట్ట బొమ్మల్ని రకరకాల దుస్తులువేసి తయారు చేసుకోవచ్చు. పల్లెపడుచుల్లాగ, పురాణాల్లో పాత్రల్లాగ, ప్రసిద్ధ వ్యక్తుల్లాగా తయారు చేసుకోవచ్చు. ఉదాహరణకి, ఇందిరాగాంధీ బొమ్మని తీసుకుందాం.

బొమ్మ ముఖాన్ని బట్టతో మనమే తయారుచేసుకోవచ్చు. తయారు చెయ్యడానికి, ఇంట్లో ఏదైనా విగ్రహం ఉండాలి - లోహపుదిగాని, చెక్కదిగాని. ముక్కూ, బుగ్గలూ, మూతీ - అన్నీ తీరుగా ఉన్న విగ్రహం ఉంటే, బట్టతో చేసే ముఖం కూడా బాగా వస్తుంది. మనకి కావలిసిన విధంగా తరవాత మార్పులు చేసుకోవచ్చు.

ఒక తెల్లని బట్టముక్క ('లాంగ్‌క్లాత్' వంటిది), ఒక లేతరంగు బట్టముక్క('లాన్' వంటిది) - ముఖానికి కావాలి. మైదాపిండిలో కొద్దిగా నీళ్లు కలిపి, ఒక చెమ్చాడు ముద్ద అయేలా ఉడకపెట్టాలి. విగ్రహం ముఖానికి నుదిటిపైనుంచి మెడకింది వరకూ, ఈ చెవినుంచి ఆ చెవి వరకూ కొద్దిగా నూనె రాయాలి. అప్పుడు, ఆ నూనె పూసినంతమేరా కప్పేటంత తెల్లని బట్టముక్కని తీసుకుని, దానిమీద ఉడకపెట్టిన మైదా ముద్దని కొంచెం పూయాలి. మైదా ఉన్న వైపుని విగ్రహం ముఖంమీద పెట్టి, పైనుంచి వేళ్లతో నొక్కాలి-ముక్కు చుట్టూరా, ముక్కు కిందా, మెడమీదా, ఎక్కడా ముడతలు లేకుండా.

తరవాత, ముఖం రంగు బట్టముక్కమీద మైదా కొంచెం పూసి, దాన్ని తెలుపు ముక్కమీద వేసి, ముఖం మీద ముడతలు లేకుండా మళ్లీ వేళ్లతో నొక్కి సరిగ్గా ఉండేటట్లు చూసుకోవాలి.

బాగా ఆరిపోయే వరకూ అలాగే ఉంచాలి. కనీసం మూడు నాలుగు గంటలు ఆరనివ్వడం మంచిది. ఆరినతరవాత, ఒక పక్కనుంచి పెళ్లగిస్తే, బట్టముఖం దొప్పలాగ బయటికి వచ్చేస్తుంది. విగ్రహం ముఖంమీద నూనె పూయడం వల్ల మైదాపిండి ఎక్కడా అంటుకోకుండా బట్ట ఊడొచ్చేస్తుంది. విగ్రహం పాడవదు.

తలకాయ నిమ్మకాయంత ఉంటే బొమ్మ దాదాపు పది అంగుళాల పొడవులో వస్తుంది. ముఖం రంగుది పావుగజం బట్టచాలు. దుస్తులకి వేరేగా తగినంత వాడుకోవాలి.

ముఖం దొప్ప లోపల బాగా ఎండిపోయిన తరవాత, చుట్టూ అంచులు వంకర లేకుండా కత్తిరించుకోవాలి. ముఖం రంగు బట్టని కనీసం 2 అంగుళాల వెడల్పూ, 5 అంగుళాల పొడుగూ ఉండేటట్లు కత్తిరించి, పొడుగువైపు నుంచి 'బట్టముఖం' అంచు మీద పెట్టి, ఒక చెవికింద నుంచి రెండవ చెవి కింది వరకూ - నుదుటి మీదుగా - గట్టి కుట్టుతో అతకాలి.

అతికిన తరవాత, బట్టని వెనక్కి తిప్పి, ముఖాన్ని సరిచేసి, వెనకాల మెడదగ్గర సన్నగానూ, పైన తల దగ్గర వెడల్పుగానూ ఉండేటట్లూ అంచుల్ని అతకాలి. వెనకాల, పైన కోసుగా వచ్చిన భాగాన్ని కత్తిరించి అర్చిలా కుట్టాలి. తరవాత, లోపలి ఖాళీ జాగాలో దూదిని కూరాలి (పాత దూది చాలు). దూదిని బాగా నొక్కి, మెడవరకూ కూరాలి.

శరీరం మధ్య భాగాన్నీ, చేతుల్నీ బొమ్మలో చూపించినట్లుగా, ముఖం రంగు బట్టని మడిచి రెండేసి పొరలు కత్తిరించుకోవాలి. ఒక్కొక్క భాగాన్నీ తీసుకుని, రెండు పొరల్నీ కలిపి అంచులమీద గట్టి కుట్టుతో అతకాలి - మెడదగ్గరా, భుజాల దగ్గరా అతక్కుండా వదిలెయ్యాలి. అతికిన వాటిని తిరగేసి, లోపల కొంచెం కొంచెం చొప్పుని దూదిని బిగువుగా వచ్చేట్టు కూరాలి.

అప్పుడు, మెడమీద 'బొమ్మ తల'నిపెట్టి, అంచుల్ని లోపలికి మడిచి, రెండింటినీ కలిపి చుట్టూ అతకాలి రెండుమూడు సార్లు. ఛెస్ట్ ఎత్తుగా ఉండేలాగ దూదితో ఉండలు చేసి ఛెస్ట్ మీదపెట్టి, పైన ఒక పల్చని బట్ట ముక్క కప్పి కుట్టాలి. చేతుల చివరి భాగంలో కొంచెం పల్చగా ఉండేలాగ దూదిని కూరి, చెయ్యిపూర్తయాక, వేళ్లు ఉన్నట్టుగా టాకాలు వెయ్యాలి. చేతుల్ని

బొమ్మ భుజాల దగ్గర అతకాలి. కాళ్లకి బదులుగా సీసానిగాని, చదునుగా ఉండే డబ్బానిగాని వాడచ్చు. దాన్నిబట్టతో కప్పి కుట్టి, బొమ్మ నడుము కింద అతకాలి. బొమ్మకి జుట్టు స్థానంలో ముందుగా నలుపురంగు బట్టని తలచుట్టూ కుట్టాలి. నలుపూ, తెలుపూ రంగుల్లో ఊలు ముక్కల్ని పొరలు విప్పి, తలమీద వొత్తుగా పెట్టి కుట్టాలి-ఇందిరాగాంధీ "హెయిర్ స్టైల్"లో. జాకట్టు బట్టని బొమ్మలో చూపించినట్లు కత్తిరించుకోవాలి. ముందుగా, ఛాతీ ముక్కనీ, వీపు ముక్కనీ బొమ్మకి రెండు వైపులా పెట్టి, భుజాలదగ్గర అంచుల్ని లోపలికి మడుస్తూ అతకాలి. తరవాత, పక్కల్ని మడిచి అతకాలి. నడుము చుట్టూ అంచుని లోపలికి మడిచి టాకాలు వెయ్యాలి. చేతి ముక్కని ముందు భుజం చుట్టూ అతికి, తరవాత కిందివైపు పొడుగుగా అతకాలి. నడుముకింద పెట్టిన డబ్బాకి బట్ట ఉంటుంది కనుక చీర కిందికి పరికిణీ వేరే కుట్టక్కర్లేదు. చీర కుచ్చెళ్లని లోపలికి దోపకుండా, తగినంత పొడుగు చూసుకుని, పొట్ట ఎత్తుగా రాకుండా కుచ్చెళ్ళు సర్ది, కుట్టు కనిపించకుండా టాకాలు వెయ్యాలి.

మెడలో తులసి పూసలుగాని, చిన్న రుద్రాక్షలుగాని గుచ్చిన దండ వెయ్యాలి.

(అముద్రిత వ్యాసం)



